Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!








It's time to go back to school again. Time for text books. Time for games. Time to meet old friends. And make new ones. Time to start studying again. Because there's so much to learn about the world around you.

From all of us here at Chandamama, have a great year in school. And remember to tell us what you've learnt everyday, when you come home from school !






HANDAMAMA

ARTIG1246



# చందమామ

ఏప్రిల్ 1995



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు






విడి ప్రతి : **5.00**

సంవత్సర చందా : **60.00**




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'     సంచాలకుడు : నాగిరెడ్డి

## విద్యార్థులు - పరీక్షలు

ఈసరికి కొందరు విద్యార్థులు పరీక్షలు రాసి ముగించి ఉంటారు; మరి కొందరు రాస్తూ ఉంటారు; ఇంకా కొందరు పరీక్షల కోసం చదువుతూ ఉండవచ్చు. పరీక్షలురాయడం,ఉత్తీర్ణులు కావడం యేటా జరిగే సర్వసాధారణమైన విషయమే. అయితే, సంవత్సరం పొడవునా నేర్చుకున్న విద్య ఏపాటిదో తెలుసుకోవడానికి ఈ పరీక్షలు, మార్కులు కొలబద్దలు అవుతాయా అన్నది ఆలోచించవలసిన విషయం.

నిజానికి విద్యార్థులు ఒక విద్యాసంవత్సరంలో తరగతిలో నేర్చుకునేది ఎంత? ఇతరవిషయాలలో సాధించేదేమిటి?మొదలైనఅంశాలను పరిశీలించడానికి కేంద్ర ప్రభుత్వం 1989వ సం॥లో సర్వేకోసం ఒక కమిటీని నియమించింది. 20 రాష్ట్రాలలో 60,000 మంది విద్యార్థుల నుంచి వివరాలను సేకరించడానికి మూడేళ్ళూ; వాటిని విశ్లేషించడానికి మరొక రెండేళ్ళూ పట్టాయి.

చిన్నతరగతుల నుంచి పైతరగతులకు వెళ్ళేకొద్దీ పాఠ్యాంశాలవరకే దృష్టి.పరిమితం కావడంవల్ల, విద్యార్థులకు పాఠ్యేతరవిషయాలు నేర్చుకునే ఆసక్తి తగ్గుతున్నదని ఈ సర్వేలో తెలిసింది. గ్రామీణ ప్రాంత విద్యార్థులకన్నా, నగరాలలోని విద్యార్థులు బాగా చదవడంలో ఆశ్చర్యం లేదు. అయితే, విద్యార్థులకన్నా విద్యార్థినులు విద్యపట్ల ఎక్కువ శ్రద్ధాసక్తులు కనబరచడం చెప్పుకోతగ్గ విశేషం. అన్నిటినీమించి, ఉపాధ్యాయుల విషయపరిజ్ఞానం, వారిబోధనాపద్ధతుల మీదే విద్యార్థుల అభివృద్ధి ఆధారపడి ఉంటుందన్న సత్యం ఈ సర్వే ద్వారా తేటతెల్లమయింది!

సంపుటి : 97     ఏప్రిల్ '95     సంచిక: 4

విడిప్రతి : 5.00     సంవత్సర చందా : 60.00



SANKAR

వార్తలు - విశేషాలు :

# పేదరికంపై పోరాటం!

డేనిష్ రాజధాని కోపెన్‌హాగన్‌లో మార్చ్ 6 నుంచి 12వ తేదీ వరకు 'సాంఘికాభివృద్ధి' ప్రపంచ మహాసభలు జరిగాయి. ఈ సభలలో పాల్గొనవలసిందిగా నిర్వాహకులు 185 దేశాలకు ఆహ్వానాలు పంపారు. 121 దేశాల నాయకులు స్వయంగా వారం రోజులపాటు జరిగిన ఈసభల లోఏదో ఒక రోజున పాల్గొన్నారు. ఇది చాలా అపూర్వమైన విషయం. 180 పైచిలుకు దేశాల నుంచి 6,000 మందికి పైగా డెలిగేట్లు హాజర య్యారు. వారికి రెండింతలు – 100కి పైబడిన ప్రభుత్వేతర సంస్థల ప్రతినిధులు ఈ సమావేశా లకు వచ్చారు. దీనినిబట్టి ఈ సభల ప్రాముఖ్య తను సులభంగా గ్రహించవచ్చు.

ఈ సమావేశాలలో చర్చించబడిన ప్రధాన విషయం 'సాంఘిక అభివృద్ధి.' అంటే -- ప్రజల క్షేమం, అభ్యుదయం. ఈనాడు ప్రపంచ జనాభా లోఅధికసంఖ్యాకులు పేదరికంతో బాధపడుతు న్నారు. చదవడం, రాయడం కూడా చాలామందికి తెలియదు. పలుదేశాలలో నిరుద్యోగ సమస్య తీవ్రంగా ఉన్నది. కొందరు ప్రభుత్వం ఇచ్చే ఆర్థిక సహాయానికి కాచుకుని ఉంటే మరి కొందరు ఏ సహాయమూ అందక మరింత దుర్భరజీవితాలను అనుభవిస్తున్నారు. ప్రపంచ శాంతికీ, పేదరికానికీ సంబంధం ఉన్నదన్న విష యాన్ని కూడా ఈ సమావేశాలలో పాల్గొన్న ప్రపంచ దేశాల నాయకులు గుర్తించారు. భారత ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు ఈ విషయాన్ని గురించి ప్రస్తావిస్తూ, "పేదరికం, బాధ ప్రపం చంలో ఏమూలనున్నా శాంతిపరిరక్షణకు అవి భంగం కలిగిస్తాయి,"అని హెచ్చరించి, "సాంఘిక, ఆర్థిక అభివృద్ధి కొనసాగి మానవాభ్యుదయం సాధించాలంటే, మొదట పేదరికాన్ని నిర్మూలించే శక్తి ప్రజలకు ఉండాలి,"అన్న అవసరాన్ని ఉద్ఘా టించారు.

విశ్వమానవ శాంతికి విఘాతం కలిగించే ఇటువంటి భీకర సమస్యలను గురించి, ప్రపంచ నాయకులు ప్రస్తావించడం, ఉపన్యసించడం ఇదే మొదటిసారి కాదు. కాని,ఇంతకు ముందు జరిగిన సమావేశాలలో ఈసమస్యలను పరిష్కరిం చడానికి 'ప్రభుత్వం' తీసుకోవలసిన చర్యలను గురించే చర్చించారు. ఇప్పుడు ఈ కోపెన్ హాగన్ సమావేశం దానిని మార్చి – పేదరికం, నిరక్షరాస్యత, నిరుద్యోగం మొదలైన సమస్యలను పరిష్కరించడానికి ప్రజలే ప్రధాన పాత్ర వహిం చాలి; ఈ కృషిలో ప్రజలదే కేంద్రస్థానం అని ప్రకటించారు.

ఈ సమావేశాల పట్ల ప్రభుత్వేతర సంస్థలు చూపినఆసక్తి ప్రపంచదేశాల నాయకులకు ఈ విశ్వాసాన్ని కలిగించింది. అందుకే ప్రాథమిక స్థాయి నుంచి ఈ సమస్యలను తొలగించు కుంటూ రావాలని పిలుపునిచ్చారు.

"మానవజాతి,వినాశం కలిగించే మారణాయు ధాలను పరిపుష్టం చేయడానికే దాదాపు 20వ శతాబ్దం అంతా వెచ్చించింది. ఈ శతాబ్దం అంతమవుతూన్న ఈ సమయంలోనైనా, మానవ జాతి తన మహత్తరమైన కృషిని నిర్మాణాత్మక మైనదిశలో మళ్ళించే శుభసూచనలు కనిపిస్తు న్నాయి.పరస్పర ఆధారంతో సాగుతూన్నఈ ప్రపం చంలో పేదరికం,నిరక్షరాస్యత మొదలైన రుగ్మ తలను నిర్మూలించడానికి అంతర్జాతీయ సహ కారం ఒక్కటే తరుణోపాయం," అన్నారు మన ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు.



# దేవుడే దిగివచ్చాడు!

ధర్మవరం అనే గ్రామంలో వుండే మోహనుడు మహా పిసినారి. తండ్రి మంచం పడితే వైద్యం చేయించలేదు. ఆయన పోయాడు. తల్లి దిగులుపడితే పట్టించుకోలేదు. మరికొన్నాళ్ళకు ఆవిడా పోయింది. ఏ కోరికలూ తీరక అతడి భార్యాబిడ్డలు జీవచ్ఛవాల్లా బ్రతుకుతున్నారు. వడ్డీలకు అప్పులిచ్చి మోహనుడు లక్షలార్జించాడు.

సుధాముడనే ఆయన మోహనుడింటి ఎదుటే వుంటున్నాడు. ఆయన దైవభక్తుడు. పరోపకారి. ఎన్నో పర్యాయాలు మోహనుడికి మంచి మాటలు చెప్పి చూశాడు. ప్రయోజనం లేకపోయింది.

రుక్మిణి మోహనుడి భార్య. మహాపతివ్రత. భర్త మాటకెదురాడదు. ఆమెకిద్దరు కొడుకులు. వాళ్ళు తల్లీ, తండ్రీ చెప్పినట్లు నడుచుకుంటారు. రుక్మిణికీ, పిల్లలకూ మోహనుడి మీద తిరగబడమని సుధాముడెన్నో పర్యాయాలు చెప్పి చూశాడు. ప్రయోజనం కనబడలేదు.

మోహనుడి వద్దకు అప్పులకు వచ్చేవాళ్ళందర్నీ సుధాముడు హెచ్చరించేవాడు. కానీ వాళ్ళు అమాయకులు. నీతికి కట్టుబడినవారు. మోహనుడు తమకు చేస్తున్న అన్యాయం ఏమీ లేదనీ, అంతా తమ కర్మ ఫలితమనీ వాళ్ళు నమ్మేవారు.

ఇదంతా చూసి సుధాముడికి కడుపుడికిపోయేది. మోహనుడి అన్యాయాలు అరికట్టే ఉపాయమేమీ తోచక చివరకు అతడొక నిర్ణయానికి వచ్చాడు; మోహనుణ్ణి చంపేయాలనుకున్నాడు.

"మోహనుడి వల్ల నాకే అపకారమూ జరగలేదు. మోహనుణ్ణి చంపడం వల్ల నాకే లాభమూ లేదు. ఇతరులకే! కాబట్టి అతణ్ణి చంపడం పరోపకారమే అవుతుంది," అనుకున్నాడు సుధాముడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి

సుధాముడికొక ఆచారముంది. ఏ పని తలపెట్టినా ముందుగా రామాలయానికి వెళ్ళి కళ్ళు మూసుకుని, దేవుడి విగ్రహానికి దణ్ణం పెట్టి దీవించమని కోరతాడు. ఆ తర్వాతనే ఆ పని చేస్తాడు.

ఈ సారి కూడా సుధాముడు శ్రీరాముడి ఆలయానికి వెళ్ళాడు. ఆ సమయంలో ఆలయంలో పూజారి లేడు. సుధాముడి ప్రార్థన పూర్తయ్యాక కళ్ళు తెరవగానే, అతడికెదురుగా ముచ్చట గొలిపే రూపంతో పదహారేళ్ళ యువకుడు కనిపించి, "సుధామా! నేను దేవుణ్ణి. పదా, నీతో ఇంటికి వస్తాను," అన్నాడు.



సుధాముడాశ్చర్యపడి, "నువ్వు దేవుడివా? ఎలా నమ్మేది?" అన్నాడు.

"నువ్వు, నీ వల్లకాని పని చేయాలనుకున్నావు. అందుకే నేను దివి నుంచి భువికి దిగి వచ్చి నీకు సాయపడాలనుకున్నాను. మోహనుణ్ణి చంపడం నీ వల్ల కాదు. పాపాత్ములకు పాప బలం వుంటుంది. వాళ్ళను యుక్తితో లొంగదీయాలి తప్ప శక్తితో లొంగదీయలేము," అన్నాడు దేవుడు.

మోహనుణ్ణి గురించి తన మనసులోని ఆలోచన మరెవ్వరికీ తెలియదు. అందుచేత సుధాముడు, ఆ యువకుణ్ణి దేవుడని నమ్మి సాష్టాంగపడ్డాడు.

దేవుడతడిని లేవనెత్తి, "నేను దేవుడినన్న విషయం మోహనుడికి తప్ప ఇంకెవరికీ చెప్పకు. ఆ తర్వాత జరిగేది చూడు," అన్నాడు.

ఇద్దరూ సుధాముడి ఇంటికి వెళ్ళారు. ఆ రోజుకు ఏ ప్రయత్నమూ లేకుండానే, రుచికరమైన వంటకాలు ఇంట్లో తయారయ్యాయి. కొన్ని తినుబండారాలను తీసుకుని సుధాముడు, మోహనుడి ఇంటికి వెళ్ళాడు. మోహనుడు వాటి రుచికి ఆశ్చర్యపడి, విశేషమేమిటని అడిగాడు.

"సాక్షాత్తూ ఆ దేవుడు నా ఇంట బస చేశాడు. ఈ విషయం నీకు తప్ప ఎవరికీ చెప్పవద్దని ఆజ్ఞాపించాడు. కాబట్టి విషయం రహస్యంగా వుంచు," అన్నాడు సుధాముడు నెమ్మదిగా.

"దేవుడెలాగుంటాడో చూస్తాను. ఒకసారి మా ఇంటికి తీసుకునిరా!" అన్నాడు మోహ



కివ్వు. నీ డబ్బు నూరు రెట్లవుతుంది. సుధాముడదంతా నీకే యిస్తాడు. పదివేల వరహాలు మాత్రం అతడికి విడిచిపెడితే చాలు," అన్నాడు దేవుడు.

"ఇదంతా మీరిద్దరూ కలిసి ఆడుతున్న నాటకం. ఋణపత్రం లేకుండా డబ్బిస్తే- ఆ తర్వాత సుధాముడు కాదంటే?" అని అడిగాడు మోహనుడు.

"సాక్షాత్తూ దేవుడు నీకు సాక్ష్యముండగా ఋణపత్రమెందుకు?" అన్నాడు దేవుడు నవ్వుతూ.

"నువ్వు దేవుడివని నాకు నమ్మకం లేదు," అన్నాడు మోహనుడు కటువుగా.

అంతలో అక్కడికి ఆ ఊరివాడే అయిన భూషయ్య వచ్చాడు. ఆయనకు పదెకరాల పొలముంది. పెద్ద మేడ వుంది. కానీ పరోపకారి కావడం వల్ల చేతిలో ఎప్పుడూ డబ్బుండదు.

ఇప్పుడాయన పాలేరు పద్దయ్య కూతురుకు పెళ్ళికుదిరింది. వాడికొక వంద వరహాలు అప్పు కావలసివచ్చింది. భూషయ్య, పద్దయ్య కోసం తనే అప్పు చేయాలని వచ్చాడు. అంతకు ముందురోజే చెప్పి వుంచడం వల్ల, ఈ విషయం సుధాముడికి తెలుసు. అతడు ఋణపత్రాలు సిద్ధం చేయించి వుంచాడు.

దేవుడు, భూషయ్యతో, "చూడబోతే పరోపకారిలా వున్నావు. నువ్వు పత్రం, సాక్ష్యం లేకుండా రోజుకు వెయ్యి వరహాలు చొప్పున

నుడు. సుధాముడు సరేనని, కాసేపటకి దేవుణ్ణి వెంటబెట్టుకువచ్చాడు. మోహనుడు, దేవుణ్ణి ఎగాదిగా చూసి, "నువ్వు దేవుడివా! బసచేయడానికి నీకు సుధాముడి ఇల్లు తప్ప మరెక్కడా దొరకలేదా?" అని ప్రశ్నించాడు.

"సుధాముడు నా భక్తుడు. అందుకే అతడింటికి వచ్చాను," అన్నాడు దేవుడు నవ్వుతూ.

"అయినా నువ్వు దేవుడివని నమ్మకమేమిటి?" అన్నాడు మోహనుడు పరిహాసంగా నవ్వుతూ.

"ఆ సంగతి నువ్వే గ్రహిస్తావు. ఋణపత్రం లేకుండా రోజుకు వెయ్యి వరహాల చొప్పున పదివేల వరహాలు పదిరోజుల్లో సుధాముడి

సుధాముడికివ్వు. పదిరోజుల తర్వాత ఆ డబ్బు నూరు రెట్లవుతుంది. అంతా నీదే! పదివేల వరహాలు మాత్రం సుధాముడికి విడిచిపెడితే చాలు," అన్నాడు.

"నువ్వు చెప్పినట్లే చేస్తాను. కానీ రోజుకు వెయ్యి వరహాలెక్కణ్ణించి తెచ్చేది?" అన్నాడు భూషయ్య దిగులుగా.

"దాందేముంది! ఈ మోహనుడే నీకు అప్పిస్తాడు," అన్నాడు దేవుడు.

మోహనుడు వెంటనే భూషయ్యతో, "నేను మాత్రం సాక్ష్యం లేకుండా అప్పివ్వను. నీ ఇల్లు, భూమి హామీగా పెట్టి పత్రం రాసిస్తే, మొత్తం పదివేల వరహాలూ ఒక్కసారే ఇస్తాను," అన్నాడు.

"అప్పు ఒక్కసారే తీసుకున్నా, డబ్బు ఒక్కసారే ఇవ్వడానికి వీల్లేదు. అలా చేస్తే అదృష్టంకలిసిరాదు," అని దేవుడు, భూషయ్యను హెచ్చరించాడు.

భూషయ్య, మోహనుడు కోరిన విధంగా ఋణపత్రం రాసిచ్చి పదివేల వరహాలు తీసుకుని, అందులో వెయ్యి వరహాలు సుధాముడికిచ్చాడు. దేవుడాయనతో, "ఈ విషయం ఊళ్ళో నీకు తెలిసినవారందరికీ చెప్పు. వెయ్యి వరహాలన్న సిద్ధాంతమేమీలేదు. ఒక్క వరహా కావచ్చు. లక్ష వరహాలు కావచ్చు. మొత్తం ఎంతిస్తే అంతకు నూరు రెట్లవుతుంది, తెలిసిందా?" అన్నాడు.

ఇందుకు సరేనని తల ఊపి భూషయ్య వెళ్ళిపోయాడు.

"మీరంతా కలసి నన్ను బికారిని చేయాలని ఏదో పథకం వేశారు. నువ్వు నిజంగా





ఆ సాయంకాలం మోహనుడింటి ముందు జనం బాగా పోగయ్యారు.

అంతా తమకున్నవన్నీ తాకట్లు పెట్టి, అతడి దగ్గర అప్పు తీసుకుని, సుధాముడింట్లో డబ్బి స్తున్నారు. ఆవిధంగా సుధాముడింట్లో కనక వర్షం కురుస్తున్నది.

ఇదంతా చూసి సుధాముడు కంగారు పడిపోతూ, దేవుడితో, "అంతా నాకు అయో మయంగా వున్నది. ఒక పిసినారి ప్రజాకంట కుణ్ణి చంపడానికి ఇంత తతంగం దేనికి? నీ కారణంగా మోహనుడు మరింత బాగుప డ్డాడు. ఎప్పుడూ చేయని వాళ్ళందరూ వాడి వద్ద అప్పుచేసి, వాడి గుప్పిట్లోకి వెళ్ళిపోతు న్నారు. నీ లీల ఏమిటో నాకు తెలియడం లేదు. నువ్వు మోహనుణ్ణి మోసగించాలని వేసిన పథకం కూడా పారలేదు," అంటూ వాపోయాడు.

అంతా చిరునవ్వుతో విన్న దేవుడు, "నేను మోహనుణ్ణి మోసగించాలనుకోలేదు. అతడికి అంతా నిజమే చెప్పాను. పది లక్షల వరహా లను పదికోట్లు చేసుకునే అవకాశమిచ్చాను. ఇంకా పదిరోజుల వ్యవధివున్నదికదా, మనసు మార్చుకుంటాడేమో చూద్దాం!" అన్నాడు.

అలా పదిరోజులు గడిచిపోయాయి. దేవుడు, సుధాముడితో, "కాసేపట్లో అందరి డబ్బూ నూరు రెట్లవుతుంది. వాగ్దానం చేసిన ప్రకారం ఎవరిడబ్బు వారికివ్వు. నీకు వచ్చిన దానితో తరతరాలు సుఖంగా జీవించు. నాకు

దేవుడివే అయితే, నేను నమ్మే మహిమ ఏదైనా నా ఎదుట చెయ్యి," అన్నాడు మోహ నుడు.

"అయితే చూడు, నా దశావతారాల రూపాలు ప్రదర్శిస్తాను!" అన్నాడు దేవుడు.

మోహనుడు దేవుడి వంకే చూశాడు. అతడికి దేవుడు ముందున్నట్టే కనిపించాడు, ఏ మార్పూ లేదు. సుధాముడు మాత్రం దశా వతారాల రూపాలను చూసి పరవశించిపోతూ స్తోత్రాలు చేశాడు.

"అంతా పచ్చి మోసం. మీరు నాటక మాడుతున్నారు. ఇక వెళ్ళండి!" అన్నాడు మోహనుడు కోపంగా. దేవుడు, సుధాముడు అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

కాస్త పని మిగిలిపోయింది. అది ముగించు కుని చక్కాపోతాను," అంటూ బయలుదేరి మోహనుడింటికి వెళ్ళాడు.

మోహనుడు దేవుణ్ణి చూసి నవ్వుతూ, "గడువు కాలం ముగిసింది. తొందరగా ఎక్కడికైనా ఉడాయించు. లేకపోతే దగాపడ్డ తమ్ముళ్ళందరూ నీ మీద రాళ్ళ వర్షం కురి పించి చంపేస్తారు. మళ్ళీ గోవర్ధన పర్వతం ఎత్తుదామన్నా దగ్గర్లో కొండలు లేవు," అన్నాడు.

"నేను దేవుణ్ణి. కొండలు లేకపోతే సృష్టిం చగలను. నా కృష్ణావతారంచూడు!" అంటూ గోవర్ధన పర్వతాన్నెత్తిన కృష్ణుడి రూపంలో సాక్షాత్కరించాడు.

మోహనుడాదృశ్యం తెల్లబోయి చూస్తూ, "నువ్వు నిజంగా దేవుడివా?" అన్నాడు.

అంతే! దేవుడు అక్కణ్ణించి మాయమ య్యాడు.

మోహనుడు నిలువెల్లాకంపించిపోతూ తల పట్టుకుని కూర్చున్నాడు. అంతలో అతడింటికి ఒక్కరొక్కరుగా జనంరాసాగారు. వాళ్ళందరికీ సుధాముడింట ఇచ్చిన ధనం నూరు రెట్ల యింది. బాకీ తీర్చడానికి వచ్చిన వాళ్ళందరూ మోహనుణ్ణి వడ్డీ లెక్క కట్టమన్నారు.

మోహనుడు మధ్య మధ్య కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ లెక్కలుకట్టి, వాళ్ళ నుంచి తనకు రావలసిన అసలూ, వడ్డీ తీసుకున్నాడు. వాళ్ళు వెళ్ళిపోగానే అతణ్ణి పశ్చాత్తాపం ముంచె త్తింది.

తనను సన్మార్గంలో పెట్టేందుకు దేవుడే దిగి వచ్చాడన్న మాట! తనను ముందే నమ్మించి వుంటే ఎంత బాగుండేది?

మోహనుడు ఇలా ఆలోచిస్తూ, దుఃఖం భరించలేక పశ్చాత్తాపంతో రెండు, మూడు నెలల కాలం మంచం పట్టాడు.

తర్వాత ఆ వూరిలో ఉండడం ఇష్టం లేక దూరప్రాంతాన గల మరొక ఊరు చేరి, అక్కడ పేద సాదలకు తన చేతనైన సాయం చేస్తూ, జీవిత కాలాన్ని తృప్తిగా గడిపాడు.



# మోసం - లాభం

రాజధానిలో యువరాజు పుట్టినరోజు వేడుకలు చూడడానికి బాలయ్య, భద్రయ్య తమ గ్రామం నుంచి బయలుదేరారు. ఇద్దరూ ఒట్టి అమాయకులు. రాజధానిలో మోసగాళ్ళెక్కువ. జాగ్రత్తగా వుండండని ఎరిగిన వాళ్ళు ఇద్దరినీ హెచ్చరించారు.

వాళ్ళు రాజధాని చేరి, యువరాజు పుట్టినరోజు వేడుకలు చూస్తూ ఆనందించ సాగారు. ఒకచోట వాళ్ళు, ఆకాశాన్నంటేటట్టున్న రాణిగారి మహలు అందాన్ని అబ్బుర పడిపోతూ చూశారు. మహలుకు ఎక్కడ చూసినా అందమైన గాజుకిటికీలు.

"ఒకటి, రెండు... ఆరు... పదహారు... ఇరవై రెండు...," అంటూ లెక్కపెట్ట సాగాడు బాలయ్య.

వాడి లెక్క ఇంకా పూర్తికాకుండానే, ఎక్కడి నుంచో కోరమీసాలవాడొకడు వచ్చి, "ఎన్ని కిటికీలు లెక్కపెట్టావు?" అంటూ ఉరిమినట్టు అడిగాడు.

బాలయ్య భయపడిపోతూ, "పదహారండి!" అన్నాడు.

"అయితే, పదహారు రూపాయలివ్వు," అని గద్దించాడు కోరమీసాలవాడు.

బాలయ్య వాడికి సంచీలోంచి పదహారు రూపాయలు తీసి ఇచ్చాడు. వాడు శరవేగంతో పక్క వీధిలోకి మాయమయ్యాడు.

"చూశావా, బాలయ్యా! ఎలా మోసపోయామో," అన్నాడు భద్రయ్య ఏడుపుముఖంతో.

దానికి బాలయ్య ధీమాగా, "మనమెక్కడ మోసపోయాం! మనమే వాడిని నిలువునా మోసం చేశాం. నేను లెక్కపెట్టింది ఇరవైరెండు కిటికీలు. మనకే ఆరు రూపాయలు లాభం!" అన్నాడు.

— కె.ఎన్. హనుమంతరావు






[ట్రోయ్ నగరాన్ని గ్రీకులు ముట్టడించిన తొమ్మిది సంవత్సరాలకు గ్రీకు శిబిరంలో అంతఃకలహం ఏర్పడి, గ్రీకు వీరులలో అగ్రగణ్యుడైన వజ్రకాయుడు యుద్ధరంగం నుంచి వైదొలిగాడు. అది చూసి ట్రోజనులు విజృంభించి గ్రీకులను చావుదెబ్బ కొట్టారు; ఒక గ్రీకు నౌకకు నిప్పు కూడా అంటించారు. ఇంతపని జరిగాక వజ్రకాయుడు తటస్థంగా ఉండలేక తిరిగి యుద్ధరంగానికి వచ్చాడు. ట్రోజను వీరులలో అగ్రగణ్యుడైన వీరసింహుడు వజ్రకాయుడి చేతిలో చచ్చిపోయాడు. భువనసుందరిని ఎత్తుకుపోయిన మోహనుడు సూర్యాలయంలో, వజ్రకాయుడి కుడి మడమను కొట్టి అతన్ని చంపేశాడు.]

వజ్రకాయుడి మరణానంతరం ఆచారం ప్రకారం పోటీ పందెములు జరిగాయి. పరుగులో దేవమయుడూ, చక్రం విసరటంలో భూధవుడూ గెలిచారు.

వజ్రకాయుడి తల్లి తటిని తన కొడుకు తాలూకు అస్త్రశస్త్రాలను మిగిలిన గ్రీకులలో కెల్లా మహాయోధుడైనవాడికి ఇచ్చేస్తానని అన్నది. వజ్రకాయుడి శవాన్ని సాహసోపేతంగా రక్షించి తెచ్చిన రూపధరుడూ, భూధవుడూ మాత్రమే సాహసించి ఆ అస్త్రశస్త్రాలకు తాము అర్హులమని ప్రకటించారు. మరెవరికీ ఆ ధైర్యం లేకపోయింది.

వారిద్దరిలో ఎవరు ఉత్తమయోధుడో రారాజు తేల్చలేక, వయోవృద్ధుడూ, జ్ఞానవృద్ధుడూ అయిన నవద్యోతుణ్ణి ఈ విషయమై సలహా అడిగాడు.

"మన పరాక్రమం మన శత్రువులకు బాగా తెలుస్తుంది. మన వీరులను గురించి

గ్రీకు పురాణ గాథ

వారేమనుకుంటున్నదీ తెలుసుకురావటానికి మన వేగులవాళ్లను రాత్రివేళ కోట గోడల కిందికి పంపు," అని నవద్యోతుడు రారాజుకు సలహా ఇచ్చాడు.

గ్రీకుల వేగులవాళ్లు ఆ ప్రకారమే చీకటి మాటున ట్రోయ్‌కోట గోడలకిందికి వెళ్లి, గోడ అవతల కొందరు యువతులు తమలో తాము ముచ్చటించుకుంటూ ఉండటం ఆల కించారు.

ఆ యువతులు వజ్రకాయుడి శరీరాన్ని గ్రీకు వీరులు తీసుకు పోవటం గురించే మాట్లాడుకుంటున్నారు. వారి సంభాషణ గ్రీకు వేగులవాళ్లకు వినిపించింది.

"మన వీరులు అస్త్రవర్షం కురిపిస్తున్నా లక్ష్యపెట్టక వజ్రకాయుడి శవాన్ని భుజాన వేసుకుని తీసుకుపోయిన భూధవుడి పరాక్ర మంచాలా గొప్పది!" అన్నది ఒక ట్రోజను యువతి.

వెంటనే మరొకతె, "భుజాన శవాన్ని పెట్టి మోయమంటే బానిసముండ కూడా మోస్తుంది. అందులో ఏం ప్రతాపం ఉంది? తననూ, భూధవుణ్ణీ కూడా రక్షిస్తూ అంత మందితో ఎదురుపోరిన రూపధరుడిదే నిజ మైన పరాక్రమం!" అన్నది.

మిగిలిన ఆడవాళ్లంతా ఈమాట నిజమ న్నారు.

వేగులవాళ్లు ఈ సంగతి తీసుకుపోయి రారాజుకు తెలియజేశారు. అప్పుడు రారాజు వజ్రకాయుడి శస్త్రాస్త్రాలను రూపధరుడికే ఇప్పించాడు.



ఇది నిజంగా భూధవుడికి అవమానమే. వజ్రకాయుడే బతికి ఉంటే తన దాయాది అయిన భూధవుడికి ఇంత అవమానం కలగటం చూసి రారాజునూ, ప్రతాపుణ్ణీ ఏమి చేసి ఉండేవాడో. అతను లేడు గనకనే రారాజు రూపధరుణ్ణి భూధవుడికన్న గొప్ప యోధుడుగా నిర్ణయించగలిగాడు.

కోపావేశంలో భూధవుడికి మతిపోయింది. గ్రీకులు ట్రోయ్ పరిసరాలలో కొల్లగొట్టిన పశువులన్నీ ఒకచోట ఉన్నాయి. భూధవుడు ఉన్మాదంలో వాటి మధ్యకు పోయి వాటిని చిత్రవధ చేశాడు. రెండు తెల్లకాళ్ల గొర్రెలను చూసి, ఒకదాన్ని రారాజో, ప్రతాపుడో అను కుని, దాని తల తెగవేశాడు. రెండవదాన్ని రూపధరుడనుకుని, దాన్ని ఒక గుంజకు నిలబెట్టి కట్టి కొరడాతో కొట్టాడు. కొంత సేపటికి అతని ఉన్మాదం శాంతించింది. తరవాత, అతను సముద్రతీరానికి వెళ్ళి అక్కడ కత్తితో పొడుచుకుని ఆత్మహత్య చేసుకున్నాడు.

భూధవుడి శవానికి వీరోచితమైన దహన సంస్కారం జరగటానికి వీలులేదనీ, పాతెయ్యా వలసిందేననీ ప్రతాపుడు అన్నాడు. కాని రూపధరుడు అడ్డుపడి భూధవుడికి వీరోచిమైన దహన సంస్కారం జరిగేలాగు ఏర్పాటు చేశాడు.

వజ్రకాయుడి మరణంతో గ్రీకులకు నిస్పృహ కలిగింది. దివ్యదృష్టిగల కాంశుకుడు ఈ స్థితిలో ఒక జోస్యం చెప్పాడు. లెమ్నోస్ దీవిని ఏలే ధనధవుడి వద్ద దేవతల విల్లూ,





బాణాలూ ఉన్నాయి; వాటిని తెస్తేనే తప్ప లేకపోతే గ్రీకులు ఎంత కష్టపడినా ట్రోయ్ నగరాన్ని జయంచలేరు!

ఈ పని సాధించుకురావటానికిగాను రారాజు రూపధరుణ్ణీ, దేవమయుణ్ణీ ఒక ఓడ ఇచ్చి పంపాడు. లెమ్నోస్ దీవి గ్రీకు శిబిరానికి సుమారు నలభై మైళ్ల దూరాన ఉన్నది. గ్రీకు వీరులు వచ్చేసరికి ధనధవుడు రాచపుండుతో తీసుకుంటున్నాడు. మాయో పాయాలకు నిధి అయిన రూపధరుడు మాయమాటలతో ధనధవుడి వద్ద ఉన్న విల్లూ, బాణాలూ పుచ్చుకుందామని చూశాడు గాని, దేవమయుడు పడనివ్వలేదు. ధనధవుడికి దేవతలు కనిపించి, "నీవు బయలుదేరి ట్రోయ్‌కి వెళ్లు. ఆ యుద్ధంలో నీకు గొప్ప కీర్తి, లాభమూ దొరుకుతాయి. నీవూ, వజ్రకాయుడి కొడుకు నవయోధుడూ కలిసి ట్రోయ్ పతనానికి కారకులవుతారు. మీ ఇద్దరిలో ఎవరు లేకపోయినా ఆ నగరం పతనం కాదు!" అని చెప్పారు.

ఆ ప్రకారమే ధనధవుడు తనవద్ద ఉన్న దివ్య ధనుర్బాణాలతో సహా బయలుదేరి గ్రీకు వీరుల వెంట యుద్ధరంగానికి వచ్చాడు. గ్రీకు శిబిరంలో మంచి శస్త్ర వైద్యులున్నారు, వారు ధనధవుడిచేత స్నానం చేయించి, నిద్రపుచ్చి, వ్రణానికి శస్త్రచికిత్స చేసి, గాయానికి మందులువేసి, నాగమణిశిల అతికించి కట్టు కట్టారు.

త్వరలోనే ధనధవుడి వ్రణం నయమయిపోయింది. అతను లేచిన రోజునే యుద్ధరంగానికి బయలుదేరి మోహనుణ్ణి విలుయుద్ధానికి ఆహ్వానించాడు. ఈ యుద్ధంలో ధనధవుడు విసిరిన మొదటి బాణం మోహనుడికి తగలలేదు. కాని రెండవది మోహనుడి ఎడమచేతికి — బాణం పట్టిన చేతికి — తగిలింది. మూడవ బాణానికి మోహనుడి కుడి కన్ను పోయింది. నాలుగవ బాణంతో ధనధవుడు మోహనుడి కాలిమడమను బలంగా కొట్టాడు.

మోహనుడు అపాయస్థితిలో ఉండటం చూసి ప్రతాపుడు ఒక్క దెబ్బతో అతన్ని యమపురికి పంపుదామనుకున్నాడు. కాని,

మోహనుడు కుంటుకుంటూ ప్రతాపుడికి చిక్కకుండా కోటగోడల లోపలికి వెళ్లిపోగలిగాడు. మోహనుడికి చికిత్స చెయ్యటానికి ఐడాపర్వతం నుంచి ఓషధులను గంపలో తెప్పించారు. కాని అవి వచ్చేలోపలనే అతను ప్రాణాలు విడిచాడు.

మోహనుడు పోగానే, భువనసుందరి నాకు భార్య కావాలంటే నాకు భార్య కావాలని మోహనుడి సోదరులలో చంద్రుడూ, అరిభయంకరుడూ తగాదా పడ్డారు. అరిభయంకరుడే యుద్ధంలో ఎక్కువ పరాక్రమం ప్రదర్శించాడనే ఉద్దేశంతో వర్ధనుడు అతని పక్షంగా తీర్పు చెప్పాడు. కాని భువనసుందరి మటుకు తాను స్పార్టారాణిననీ, ప్రతాపుడి భార్యననీ మరిచిపోనేలేదు. ఆమె తన వారైన గ్రీకులను చేరుకునే ఉద్దేశంతో ఒక నాటి రాత్రి కోటగోడల పైకివెళ్లి బయటికి జారటానికి ఒక మోకు సిద్ధం చెయ్యసాగింది. ఆ సమయంలో పహరావాడొకడు ఆమెను చూసి, పట్టుకుని రాజభవనానికి తిరిగి తెచ్చాడు.

అరిభయంకరుడు ఆమెను బలాత్కారంగా వివాహమాడాడు.

ఈ వివాహం ట్రోజనులకు ఎంతమాత్రం నచ్చలేదు.

చంద్రుడు విరక్తి చెంది ట్రోయ్‌నగరం విడిచి ఐడాపర్వతంమీద నివసించటానికి బయలుదేరిపోయాడు. చంద్రుణ్ణి ఏవిధంగానైనా పట్టుకున్నట్టయితే అతనినుంచి ట్రోయ్ మర్మాలు తెలుసుకుని యుద్ధం విజయవంతంఅయేట్టు చూడవచ్చునని కాంశుకుడు





మర్మాలు దాచకుండా చెప్పగలను," అని చంద్రుడు రూపధరుడితో అన్నాడు.

ఇందుకు రూపధరుడు సంతోషంగా సమ్మతించాడు.

"రాగల వేసవిలో ట్రోయ్‌నగరానికి పతనం రాసిపెట్టి ఉన్నది. కాని అది అయే లోపుగా మూడు పనులు జరగాలి. ఒకటి: పీసాలో ధూమ్రముఖుడి భుజం ఎముక ఉన్నది; అది మీ శిబిరం చేరాలి. రెండు: నవయోధుడు రణరంగంలోకి రావాలి. మూడు: బుద్ధిమతీదేవి విగ్రహాన్ని కోటనుంచి కాజేయాలి; అది ఉండగా ట్రోయ్ గోడలను మీరు పడగొట్టలేరు," అని చంద్రుడు రూపధరుడికి చెప్పాడు.

రారాజుకు చెప్పాడు. ఎలాగైనా చంద్రుణ్ణి పట్టుకోమని రారాజు రూపధరుణ్ణి ప్రోత్సహించి పంపాడు.

చంద్రుడు సూర్యాలయంలో హేమతండ్రికి అతిథిగా ఉంటూ వున్న సమయంలో రూపధరుడు అతన్ని వెతుక్కుంటూ అక్కడికి వచ్చాడు.

"నేను ప్రాణాలకు వెరిచి పారిపోయి రాలేదు. ఈ ఆలయంలోనే మోహనుడు వజ్రకాయుణ్ణి అక్రమంగా చంపాడు. అందుకింకా ప్రాయశ్చిత్తం జరగలేదు. అదే నన్ను బాధిస్తున్నది. ఎక్కడైనా దూరప్రాంతంలో సురక్షితంగా నేను ఉండేటందుకు తగిన ఏర్పాటు చేసినట్టయితే, నేను ట్రోయ్

ఈరహస్యం తెలియగానే రారాజు ధూమ్రముఖుడి అస్థికను తీసుకురావటానికి కొందరిని పీసాకు పంపాడు. వజ్రకాయుడి కొడుకైన నవయోధుడు, పన్నెండేళ్ల బాలాకుమారుడు, స్కైరాస్‌లో ఉంటున్నాడు. అతనిని తీసుకురావటానికి రూపధరుడూ, రక్తవర్ణుడూ, దేవమయుడూ నౌకలో బయలుదేరి వెళ్ళారు. నవయోధుడు యుద్ధరంగంలో కాలు పెట్టగానే అతనికి అతని తండ్రి అయిన వజ్రకాయుడి ప్రేతాత్మ కనిపించింది. వజ్రకాయుడి శస్త్రాస్త్రాలను రూపధరుడు నవయోధుడికి ఇచ్చేశాడు. వయసులో చిన్నవాడై ఉండికూడా నవయోధుడు రణరంగంలో తన తండ్రి పేరు నిలబెట్టాడు. అతను యుద్ధవ్యూహ రచనలలో

కూడా గ్రీకులకు చాలా విలువయిన సలహా లిచ్చాడు.

పోతే బుద్ధిమతి విగ్రహాన్ని దొంగిలించే పని మిగిలి ఉన్నది. ఈ పని చేయటానికి రూపధరుడూ, దేవమయుడూ పూనుకున్నారు. రూపధరుడు దేవమయుడి చేత వొళ్లంతా రక్తం కారేట్టు కొట్టించుకుని శరణుజొచ్చే బానిసలాగా ట్రోయ్ నగరం ప్రవేశించాడు. అతన్ని ఒక్క భువనసుందరి మాత్రమే గుర్తించింది. అతను ఇలాటి రూపంలో రావటానికి కారణం తెలుసుకుందామని ఆమె యత్నించింది. కాని రూపధరుడు ఆమె ప్రశ్నలకు సరి అయిన జవాబులు చెప్పలేదు. ఆమె అతన్ని తన ఇంటికి తీసుకుపోయి స్నానం చేయించి, భోజనం పెట్టి, "నేనిక్కడ ఖైదీగా జీవిస్తున్నాను. నాకు మనదేశం వెళ్ళాలని ఉన్నది. ఈ సంగతి మా అత్తగారికి మాత్రమే తెలుసు. అయితే, ఆమె నా పక్షమే. మీ కార్యక్రమం నాకు వివరంగా చెప్పాలి!" అన్నది. సరిగ్గా ఆ సమయానికే వర్ధనుడి భార్య అక్కడికి వచ్చింది. రూపధరుడి పైప్రాణాలు పైనే పోయాయి. అతను ఆవిడ కాళ్లమీద పడి, భయంతో శోకాలు పెడుతూ, "నన్ను బయటపెట్టకండి!" అని ప్రార్థించాడు. వర్ధనుడి భార్య అతన్ని బయట పెట్టకపోగా అతను సురక్షితంగా తిరిగి వెళ్లటానికి కూడా తోడ్పడింది.

వెళ్ళేటప్పుడు రూపధరుడు బుద్ధిమతి విగ్రహాన్ని దొంగిలించాడు. గోడల అవతల కనిపెట్టుకుని ఉన్న దేవమయుడి భుజాన దాన్ని పెట్టాడు. ఇద్దరూ పున్నమి వెన్నెలలో నడుస్తూ శిబిరానికి వెళ్ళసాగారు. మధ్యలో రూపధరుడికి ఈ విగ్రహం తెచ్చిన కీర్తి తానే పొందాలన్న దుర్బుద్ధి పుట్టింది. అతను ఒక అడుగు వెనక్కు తగ్గి, దేవమయుణ్ణి చంపటానికి కత్తి ఎత్తాడు. ఎత్తిన కత్తి నీడ చూసి దేవమయుడు గిరుక్కున వెనక్కు తిరిగి, తన కత్తి దూసి రూపధరుణ్ణి నిరాయుధుణ్ణి చేశాడు.

ఆ తరవాత దేవమయుడు రూపధరుణ్ణి పెడరెక్కలు విరిచికట్టి, తన్నుకుంటూ శిబిరానికి తీసుకుపోయాడు. — (ఇంకా ఉంది)



# చందమామ కబుర్లు

## ముగ్గురే ముగ్గురు!

ఫిబ్రవరి-మార్చి నెలలలో శాసన సభలకు ఎన్నికలు జరిగిన నాలుగు రాష్ట్రాలలో అరుణాచల ప్రదేశ్ ఒకటి. కామెంగ్ జిల్లా త్రిశినో బురాగోన్ నియోజకవర్గంలో చక్ను అనే గ్రామం ఉన్నది. అడవులలో మూడు రోజుల ప్రయాణం తరవాతే ఆ గ్రామాన్ని చేరుకోవడం సాధ్యమవుతుంది. చక్ను గ్రామంలో ఎన్నికల అధికారులు బ్యాలట్ బాక్సులు, బ్యాలట్ పేపర్లు,మార్కింగ్ఇంక్ మొద లైన సరంజమాతో పోలింగ్ కేంద్రాన్ని పకడ్బందీగా ఏర్పాటుచేశారు. ఇంతకూ ఆ గ్రామంలో ముగ్గురే ఓటర్లు ఉన్నారు! మనదేశంలో ప్రజాస్వామ్యానికి ఇచ్చే ప్రాముఖ్యతను ఇది చాటుతున్నది!

## పైలట్‌లేని విమానం!

ఫిబ్రవరి 26 తేదీ అమెరికాలోని హావర్డ్ నుంచి ఒక జెప్లిన్ విమానం బయలుదేరింది. ఆ విమానం 70 మీటర్లు పైకి ఎగురుతున్నప్పుడే దానిని నడిపే పైలట్‌కు గుండెపోటు వచ్చి, అప్పటికప్పుడే మరణించాడు. ఆ విమానంమాత్రం



ఆగలేదు. అలాగే 3,000 మీటర్లు ఎత్తుకు వెళ్ళి, రెండు గంటలు ప్రయాణం తరవాత ఉత్తర కాలిఫోర్నియాలో, మనుషులు లేనిచోట నేల మీదకు దిగింది. తమ ఇళ్ళపై పడుతుందని భయభ్రాంతులయిన అక్కడి ప్రజలు ప్రమాదం తప్పిందని సంతోషించారు!

## చిరునామాలేని పిల్లి!

బంగ్లాదేశ్‌లోని చాంద్‌పూర్ నుంచి రాజధాని ఢాకా వరకు 65కి. మీ. దూరం ఒక పిల్లి తపాలాశాఖసంచీలో ఉత్తరాలతో పాటు ప్రయాణం చేసింది. కాని దాని మెడకు చిరునామా చీటీ లేదు! తపాలాఫీసు లో ఉత్తరాల సంచీ విప్పగానేమ్యావంటూ ఆ పిల్లి బయటకు



దూకింది. ఆ సంచీని రైలులోకి ఎత్తి విసిరినప్పుడు కాని,వెలుపలికి వేసినప్పుడుగాని పిల్లి నోరువిప్ప లేదు. ఫిబ్రవరి ఇరవై అయిదవ తేదీ ఇది జరి గింది. అయినా సంచీలోకి పిల్లిఎలా వచ్చిందన్న విషయంతపాలాశాఖవారికిఇంకాఅంతుబట్టలేదు!

## పరిశుభ్రత

అంటార్కిటికా అనగానే తెల్లటి మంచు మన కళ్ళ ముందు మెదులుతుంది. అక్కడి మెక్‌మర్డో స్టేషన్ అనే చిన్న పట్టణం జనాభా వేసవిలో 1,200; చలికాలంలో 200 మాత్రమే. ఇక్కడి ప్రజలు ఊరి వెలుపలి పల్లాలలో చెత్తా చెదారంతో మంటలు వేసేవాళ్ళు. తినగా మిగిలిన పదార్థాలను అక్కడి పల్లాలలో పడవేసేవాళ్ళు. వీటిని తినడానికి సముద్రపు కాకుల వంటి పక్షులు వచ్చేవి. అది చాలా కలుషిత ప్రాంతంగా ఉండేది. పర్యావరణపరిరక్షకులుకొందరు పూను కుని అక్కడి వారికి పరిశుభ్రతను గురించి తెలి యజెప్పడంతో ఇప్పుడు పరిస్థితి మెరుగయింది.




# చంద్రరేఖ స్వయంవరం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ, భయం కొలిపే ఈ శ్మశానంలో మొక్కవోని నీ పట్టుదలా, కఠోరదీక్షా చూస్తూంటే నువ్వెంత సాహసవంతుడివో తెలుస్తుంది. అయితే, ఒక్కొక్కసారి మితిమించిన పట్టుదలా, సాహసాల వల్ల చివరకు సాధించినది ఏమీ లేకపోవచ్చు. అయోగ్యుడూ, అసమర్థుడూ కూడా కొన్ని సందర్భాలలో అదృష్టదేవత కరుణిస్తే అందలమెక్కిన సంఘటనలు కోకొల్లలు. ఇందుకు నిదర్శనంగా, స్త్రీ సహజమైన జాలితో ఒక అయోగ్యుణ్ణి వివాహమాడిన అపురూప సౌందర్యవతి అయిన ఒకానొక యువరాణి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

**బేతాళ కథలు**



జీవితంలో వివాహం మాట తలపెట్టనని కులదైవం మీద ప్రమాణం చెయ్యాలి. ఇక, మూడవసారి కూడా ఓడిపోతే ఉరిశిక్షకు గురికావలసి వుంటుంది. ఈవిధంగా చాటింపు వేయించండి," అన్నది.

ఆమె వింత కోరికకు జయకేతనుడు ఆశ్చర్యపోయాడు. అయినా, కుమార్తె మొండి పట్టుదల తెలిసిన వాడవడంచేత, ఆమె కోరిన విధంగా చాటింపు వేయించాడు.

కొంత మంది రాకుమారులు, జగదేకసుందరి అయిన చంద్రరేఖను వివాహమాడాలని చదరంగం పోటీలో పాల్గొన్నారు. వాళ్ళందరూ చదరంగంలో అంతో ఇంతో ప్రావీణ్యం కల వాళ్ళే, కానీ అద్భుతనైపుణ్యం కలిగిన యువరాణికి సమఉజ్జీలు కాలేకపోయారు. పోటీలో పాల్గొనడం, గడియకాలం గడవకముందే పరాజితులు కావడం పరిపాటయి పోయింది. వాళ్ళు స్వయంవర నియమం ప్రకారం వంద కొరడాలు దెబ్బలు తిని, అవమాన భారంతో తమ తమ రాజ్యాలకు తిరిగిపోయారు. ఏ ఒక్కరూ యువరాణితో రెండవసారి పోటీలో పాల్గొనడానికి సిద్ధపడలేదు.

ఇలా వుండగా – చారుశీల నగరాన్ని పాలించే సూర్యతేజకు, ఈ వింత స్వయంవరం వార్త తెలిసింది. అతడు అవివాహితుడు. అంతకుముందే చారులద్వారా రాకుమారి చంద్రరేఖ అద్భుతమైన సౌందర్యాన్ని గురించి విని వున్నాడు.

పూర్వం కనకపురి రాజ్యాన్ని జయకేతనుడనే రాజు పాలించేవాడు. ఆయన కుమార్తె చంద్రరేఖ అద్భుత సౌందర్యవతి. ఆమెకు చదరంగంలో మంచి ప్రావీణ్యం వుండేది. రాజు జయకేతనుడు చదరంగంలో అత్యంత ప్రతిభావంతుడు కావడంతో, ఆమెకు బాల్యం నుంచే మంచి శిక్షణయివ్వడంవల్ల, చంద్రరేఖ చదరంగంలో రాటుతేలింది.

ఇలావుండగా ఒకనాడు చంద్రరేఖ వివాహ ప్రసక్తి వచ్చింది. ఆమె, తండ్రితో, "నాన్నగారూ! నన్ను చదరంగంలో ఓడించిన రాకుమారుణ్ణే వివాహమాడతాను. నాతో మొదటిసారి ఆడి ఓడిపోయిన రాకుమారుడికి నూరు కొరడా దెబ్బలు శిక్ష. రెండవసారి ఓడిపోతే, తిరిగి

ఆనాటివరకూ చదరంగం ఆటలో ప్రాథమిక పరిజ్ఞానం కూడా లేని సూర్యతేజ, చదరంగం నేర్చుకోవాలని నిశ్చయించుకున్నాడు. అతడు చదరంగంలో పోటీలు నిర్వహించి, అందులో ప్రథముడుగా వచ్చిన విశ్వనాథుడు అనేవాడిద్వారా, చదరంగంలోని మెళుకువలు తెలుసుకోసాగాడు. ఈవిధంగా సూర్యతేజ ఆరునెలల పాటు చదరంగాన్ని కఠోరసాధన చేశాడు.

ఒకనాడు విశ్వనాథుడు, సూర్యతేజతో, "మీ శిక్షణ పూర్తయింది, మహారాజా! నాకు సెలవిప్పించండి," అన్నాడు.

సూర్యతేజ అతడికి విలువైన బహుతులిచ్చి, చంద్రరేఖతో చదరంగం పోటీలో పాల్గొనేందుకు కనకపురికి బయలుదేరాడు.

కొంత మంది ప్రముఖ రాజోద్యోగులు, చంద్రరేఖ తల్లిదండ్రుల సమక్షంలో చదరంగంపోటీ ప్రారంభమైంది. మొదటి సారిగా చంద్రరేఖ సౌందర్యాన్ని చూసిన సూర్యతేజ చకితుడయ్యాడు. అందుకు కారణం, తన చారులు వర్ణించిన దానికంటే ఆమె గొప్ప సౌందర్యవతి.

పోటీ ఆసక్తికరంగా కొనసాగుతున్నది. చదరంగం బల్లమీద పావుల్ని ఇద్దరూ చకచకా కదుపుతున్నారు. సూర్యతేజ ఎంత నేర్పుగా ఆడినా, చంద్రరేఖ అమోఘ ప్రావీణ్యంముందు నిలవలేకపోతున్నాడు. రెండు గడియలు గడిచే సరికి సూర్యతేజ రాజును, చంద్రరేఖ బందీ చేసింది. యువరాణి గెలిచినందుకు అందరూ హర్షధ్వానాలతో అభినం





"ఒకవేళ ఈ నిబంధన మీరు విధించక పోయినా, నేను మరొక స్త్రీని వివాహం చేసుకునే అవకాశంలేదు. మీ సంతృప్తి కోసం, మీరు కోరినట్లే ప్రమాణం చేస్తున్నాను," అని సూర్యతేజ తమ కులదైవమైన పరమ శివుడి మీద ప్రమాణం చేశాడు.

ఇప్పుడు రెండవసారి పోటీ ప్రారంభమైంది. ఈ సారి సూర్యతేజ తన సర్వశక్తులూ ఒడ్డి ప్రతిఎత్తు వేయసాగాడు. చంద్రరేఖ మాత్రం నల్లేరు మీద నడకలా చకచకా ఎత్తులు వేస్తున్నది. ఆమె వేగానికి, నైపుణ్యానికి సూర్యతేజ అబ్బురపడసాగాడు. ఇంతలో ఒకసారి ఆమె సమ్మోహన రూపాన్ని చూస్తూ ఏదో పరధ్యానలో ఉండి, ఒక లిప్తకాలం అతడి ఏకాగ్రత చెదిరింది. మంత్రిని జరపాలని మనసులో అనుకుంటూనే ఏనుగును జరిపాడు. ఆ దశలో అది కీలకమైన తప్పు. అంతే – ఒక అద్భుతమైన ఎత్తుతో చంద్రరేఖ, సూర్యతేజను ఓడించింది. మరొకసారిఅందరూ ఆమెను గొప్పగా హర్షధ్వానాలతో అభినందించారు.

ఇప్పుడు సూర్యతేజ చారుశీలనగరానికి బయలుదేరడం ఖాయం అని అంతా భావించారు. అయితే, సూర్యతేజ మూడవసారి పోటీకి సిద్ధపడ్డాడు. అతడి మొండి పట్టుదలకు అంతా నివ్వెరపోయారు. రాజు జయకేతనుడు ముందుకు వచ్చి సూర్యతేజ భుజం మీద చెయ్యి వేసి, "రాకుమారా! నువ్వు యువకు

దించారు. ఇద్దరు భటులు కొరడాలతో ముందుకు వస్తుంటే, యువరాణి సూర్యతేజ కేసి జాలిగా చూసింది. ఇక సూర్యతేజ తన రాజ్యానికి బయలుదేరతాడని అంతా అనుకున్నారు. కానీ, అందరి అంచనాలనూ తల్లకిందులుచేస్తూ, సూర్యతేజ రెండవసారి పోటీలో పాల్గొనడానికి సిద్ధపడ్డాడు.

ఇది చూసి, "రెండవ సారి యువరాణి వారి చేతిలో ఓడిపోతే, పాటించవలసిన నిబంధన ఏమిటో మీకు తెలుసుగదా! జీవితంలో మరొక స్త్రీని పెళ్ళి చేసుకోనని కుల దైవం మీద ప్రమాణం చెయ్యాలి," అని కనకపురి మహామంత్రి ఆదిత్యమల్లు, సూర్యతేజను హెచ్చరించాడు.

డివి. క్షాత్రవిద్యలలో ఆరితేరినవాడివి, ఎంతో భవిష్యత్తున్నవాడివి. ఒక రాజ్యపాలకుడుగా నీకెన్నో బాధ్యతలున్నాయి. అవన్నీ మరచిపోయి ప్రాణాన్ని పణంగా పెట్టి, ఈ పోటీలో పాల్గొనవద్దు. నామాట విని మీ రాజ్యానికి తిరిగి వెళ్ళు," అని హితవు చెప్పాడు.

దానికి సూర్యతేజ మందహాసం చేసి, "నా క్షేమంకోరి మీరిచ్చిన సలహాకు కృతజ్ఞుణ్ణి. పెద్దలు జయాపజయాలు దైవాధీనాలంటారు గదా? ఈసారి నేను గెలవవచ్చు," అన్నాడు.

ఈ సంభాషణ వింటున్న రాకుమారి, సూర్యతేజ పట్టుదలకు ఆశ్చర్యపోయింది. తన ప్రాణాన్ని పణంగా పెట్టి, అతడు తనతో మరొకసారి పోటీకి సిద్ధపడడం అపూర్వం అనిపించింది. ఆమె సూర్యతేజ కేసి ఒకటి రెండు క్షణాలు కన్నార్పకుండా చూసి, రాజు జయకేతనుడితో, "నాన్నగారూ! నేను ఈ పోటీలో ఓడినట్లు అంగీకరిస్తున్నాను!" అన్నది సిగ్గుతో తలవంచుకుంటూ.

పోటీని చూస్తున్న వారందరికీ ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది. రెండుసార్లు సూర్యతేజపై సులభంగా నెగ్గిన యువరాణి, ఇప్పుడు పోటీలో పాల్గొనకుండానే ఓటమిని అంగీకరించడం, వాళ్ళను అయోమయ స్థితిలో పడవేసింది.

రాజు జయకేతనుడు మాత్రం ఏదో అర్థమయిన వాడిలా తలపంకించి, "సరి అయిన సమయంలో సరిఅయిన నిర్ణయం తీసుకున్నావమ్మా!" అంటూ కుమార్తెను అభినందించాడు.



బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సూర్య తేజ మొదటిసారి చదరంగం పోటీలో ఓడి నప్పుడు, చంద్రరేఖతో తాను సరితూగలేనని గ్రహించి వుండాలి. అలాకాక, తిరిగి రెండవ సారి, మూడవసారి పోటికి సిద్ధపడడం మూర్ఖ త్వంకాదా? ఏదో స్త్రీ సహజమైన జాలితో మూడవసారి యువరాణి పోటీకి దిగకుండానే, తను ఓడినట్లు చెప్పబట్టి సరిపోయింది. అలా కానప్పుడు, సూర్యతేజ ప్రాణాలు దక్కేవి కాదుగదా! ఇక, సరిఅయిన సమయంలో సరిఅయిన నిర్ణయం తీసుకున్నావని, రాజు జయకేతనుడు కుమార్తెను అభినందించ డంలో సందర్భశుద్ధి వున్నట్లు కనిపించడం లేదు. ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపో తుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "చదరంగంలో తను చంద్రరేఖకు సరిజోడుకాదని సూర్యతేజ, మొదటి ఆటలో ఓడినప్పుడే గ్రహించలేనంత మూర్ఖుడు కాదు. అయినా రెండవసారీ, మూడవసారీ కూడా ఆమెతో పోటీకి సిద్ధ పడ్డాడంటే, అతడికి ఆమెపైగల గాఢమైన అనురాగాన్ని తెలియజేస్తుంది. ఈ సంగతి కుశాగ్రబుద్ధి గల చంద్రరేఖ గుర్తించడం ఏమీ కష్టం కాదు. నిజానికి చంద్రరేఖ తన స్వయంవరానికంటూ నిర్వహించిన చదరం గంపోటీ ఒక సాకు మాత్రమే. మూడు అంచె లుగా నిర్ణయించబడ్డ ఈ పోటీలో, సూర్య తేజ ఒక్కడే మొదటి రెండు అంచెలు దాటి, మూడవ అంచె పోటీకి తన ప్రాణాన్ని పణంగా పెట్టి సిద్ధపడ్డాడు. చంద్రరేఖ కోరు కున్నది సరిగ్గా అన్నిటా యోగ్యుడైన ఇటువంటి భర్తనే. తన ఆశ ఫలించిందని గ్రహించగానే, ఆమె తెలివితేటలతో వ్యవహరించి, తను ఓడినట్టు ప్రకటించింది. ఇందులో జాలి అంటూ ఏమీ లేదు. ఇది గ్రహించిన జయ కేతనుడు కుమార్తె నిర్ణయాన్ని అభినందిం చాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

[ఆధారం: రాఘవరాజు పట్టాభిరామరాజు రచన]





# తెలివితేటలు

హేలాపురి నివాసి వరహాలయ్య కుమారుడు మాధవుడు, ఎనిమిదేళ్ళవాడు. తల్లిదండ్రులకు కడగొట్టువాడు కావడంతో, అల్లారు ముద్దుగా పెరిగాడు. చురుకైనవాడు, తెలివైన వాడు అని బంధువులంతా వాణ్ణి మెచ్చుకునే వారు.

అయితే, ఇంత తెలివిగలవాడని పేరు తెచ్చుకున్న మాధవుడు, ఒకే ఒక్క విషయంలో మాత్రం అతితెలివితక్కువగా ప్రవర్తించేవాడు. అదెలాగంటే, ఒకసారి ఒకబంధువు వరహాలయ్య ఇంటికి వచ్చాడు, ఏదో పనిమీద. ఆబంధువు తిరిగి వెళ్ళిపోయేముందు జేబులోంచి ఒక వెండి నాణెం, రాగినాణెం తీసి మాధవుడి ముందు పెట్టి, ఆరెండు నాణాల్లో ఏదో ఒక నాణెం తీసుకోమన్నాడు. మాధవుడు వెంటనే రాగినాణెం తీసుకున్నాడు.

ఇది చూసి ఆ బంధువు తెల్లబోయాడు. ఎంతో తెలివిగలవాడని పేరు తెచ్చుకున్న మాధవుడు, విలువైన వెండి నాణెం తీసుకోకుండా, రాగి నాణెం ఎందుకు ఎంచుకున్నాడో అర్థం కాలేదా బంధువుకు. ఆయన మాధవుడి తెలివితక్కువతనానికిలోలోపలనవ్వుకుంటూ, వెండినాణాన్ని తన జేబులో వేసుకుని వెళ్ళిపోయాడు.

ఈ జరిగిన విషయం దాగలేదు. ఆనోటా ఆనోటా పడి ఊరిలో చాలామందికి తెలిసిపోయింది. తండ్రి వరహాలయ్యను మించిన తెలివితేటలతో, వ్యాపారంలో లక్షలార్జిస్తాడని అందరూ అనుకునే మాధవుడు, ఇంత అమాయకుడూ,తెలివితక్కువవాడూనా అని నవ్వుకోసాగారు.

ఆనాటి నుంచీ మాధవుడి తెలివితక్కువతనం చూసి వినోదించేందుకు ఊరిలోని వాళ్ళు, తరచుగా వాడిముందు ఒక వెండి నాణెం, ఒక రాగి నాణెం వుంచేవాళ్ళు. ప్రతిసారీ వాడు రాగినాణెం తీసుకునేవాడు. ఇది

కోనే నాగవెంకట ఆంజనేయులు

చూసేవాళ్ళందరికీమంచి వినోదంగా వుండి, నవ్వుకునేవాళ్ళు.

ఇలా వుండగా, ఒకరోజున వరహాలయ్య ఇంటికి సోమయ్య అనే బంధువు ఒకాయన వచ్చాడు. ఆయన వరసకు మాధవుడికి మామ అవుతాడు. ఊరివాళ్ళ ద్వారా ఆయనకు మాధవుడి వెండి - రాగి నాణేలసంగతి తెలిసింది. ఇది విని ఆయన చాలా బాధపడ్డాడు. వరహాలయ్య నలుగురి సంతానంలో, మాధవుడొక్కడే మగ పిల్లవాడు. వాడు పెద్దవాడయ్యాక, తండ్రి వ్యాపారాన్ని దక్షతతో నడపలేకపోగా, ఉన్న ఆస్తి పాస్తుల్ని చిన్నాభిన్నం చేయగలడని ఆయనకు తోచింది.

సోమయ్య వారం రోజులపాటు ఊళ్ళో తన పనులు చూసుకుని, తిరిగి వెళ్ళేరోజున మాధవుణ్ణి దగ్గరకు పిలిచి, తన చేతిలోని వెండి, రాగి నాణాలను వాడికి చూపుతూ, "ఒరే, నీకిష్టమైంది ఏదో ఒకటి తీసుకో!" అన్నాడు.

మాధవుడు చప్పున రాగి నాణెం తీసుకున్నాడు. మాధవుడి తెలివితక్కువతనానికి, అందరిలా సోమయ్య హేళనగా నవ్వకపోగా, ఎంతో జాలిగా, "ఒరే,బాబూ!విలువైన వెండి నాణెం తీసుకోకుండా, రాగినాణెం తీసుకున్నావేం? నువ్వు మరీ అంతమూర్ఖుడివా!" అన్నాడు.

దానికి మాధవుడు కాస్త చిన్న గొంతుతో, "మామయ్యా! నేను వెండి నాణెం తీసుకోవడం మొదలు పెడితే, ఊళ్ళో ఎవ్వరూ తమ వినోదంకోసం, నాతో ఈ ఆట ఆడరు కదా! అప్పుడు కనీసం నాకు రాగి నాణెం కూడా దక్కదు. ఇలా ఎప్పుడూ రాగి నాణాలే తీసుకోవడం వల్ల, నా దగ్గరున్న ఇంత పెద్ద రేకు డబ్బా వాటితో నిండిపోయింది. చూడు!" అంటూ గదిలోకి పోయి బాగా బరువుగా వున్న ఒక రేకు డబ్బా తెచ్చి సోమయ్యకు చూపించాడు.

డబ్బా నిండుగా వున్న రాగి నాణేలను చూసి సోమయ్య తెల్లబోయాడు. ఆయన ఏదోఅనబోయేంతలోమాధవుడు,"మామయ్యా! ఈ సంగతి నువ్వు ఎవరితోనూ అనకు," అన్నాడు.



## మనదేశపు కోటలు - 3

# రాజపుత్రుల కోటలు - 1

చిత్రాంగదమోరీ ఏడవ శతాబ్దంలో చిత్రకూటం కోటను నిర్మించాడు.

వంద సంవత్సరాల అనంతరం సుప్రసిద్ధ గుహిల్ నాయకుడు బప్పా రావల్ దానికి చిత్తోర్ అని పేరు పెట్టి తన నివాసంగా చేసుకున్నాడు.

ఆయన వంశస్థులయిన శిశోదియులు చిత్తోర్‌ను దాదాపు 800 సంవత్సరాలు పాలించారు. కోట ప్రాంగణంలో ఈనాటికీ నిలచి ఉన్న 'విజయ స్తంభాన్ని'-1458వ సం॥లో మాల్వా సుల్తానుపై తన విజయానికి చిహ్నంగా కుంభరాణా నిర్మించాడు. 9 అంతస్తులు గలిగిన ఈ స్తంభం ఎత్తు 36 మీ॥. దీనిని నిర్మించడానికి దాదాపు పదేళ్ళు పట్టింది.

చిత్తోర్ కోట వైశాల్యంలో మనదేశంలోని మిగిలిన అన్ని కోటలకన్నా చాలా పెద్దది. ఈ కోట లోపల తాగడానికీ, వ్యవసాయానికీ కావలసిన నీళ్ళు సరఫరా చేయడానికి చాలినన్ని బావులు, దిగుడుబావులు ఉన్నాయి. ఈ కోట రెండేళ్ళ ముట్టడిని తట్టుకోగలదు.

1567వ సం॥లో అక్బర్ నాయకత్వంలో మొగల్‌సేనలు చిత్తోర్ కోటను ముట్టడించాయి. రాజు రాణా ఉదయ

'సబాత్' రక్షణ మాటున చిత్తోర్ ఘడ్‌లోకి చొచ్చుకుపోతున్న మొగలు సైన్యం

సింహుడు కోట రక్షణను జయమల్లు, పట్టా అనే ఇద్దరు సేనానాయకులకు అప్పగించి, ఆరావళి పర్వతాలకు వెళ్ళిపోయాడు.

జయమల్లు నాయకత్వంలో అతని అనుచరులు కోట రక్షణకు వీరోచితంగా పోరాడారు. మొగలు సేనలు ముందుకు వెళ్ళలేకపోయాయి. నాలుగు నెలల ముట్టడి తరవాత, ఒకనాడు హఠాత్తుగా ఫిరంగి గుండు జయ మల్లును తీవ్రంగా గాయపరచింది. అయన మరణంతో దిగ్భ్రాంతి చెందిన రాజపుత్రులను దెబ్బతీసి మొగలు సేనలు విజయం సాధించాయి.

కోటను పోగొట్టుకున్నప్పటికీ రాణా ఉదయసింహుడు లొంగిపోవడానికి సుముఖుడు కాలేదు.అయన కుమా రుడు రాణా ప్రతాప్, అతని అనుచరులు తమ కోటను మళ్ళీ పట్టుకునే వరకు సుఖజీవితానికి దూరంగా ఉండాలని ప్రతిజ్ఞ పూనారు. ఇలా ప్రతిజ్ఞ చేసుకున్న



రామ్‌పాల్ ద్వారం, చిత్తోర్‌ఘడ్

వారిలోలోహర్లుఅనబడేకమ్మరులుతాము చిత్తోర్ కోటకు తిరిగి వచ్చేంతవరకు బళ్ళలోనే నివసించగలమని శపథం చేశారు. ఆనాటి నుంచి వాళ్ళు సంచార జీవనంప్రారంభించారు. వాళ్ళను 'గడియా లోహర్లు' అనిపిలిచేవారు.1955వసం॥లో సంప్రదాయ బద్ధంగా కోటలోపలికి తీసు కుని వెళ్ళేంత వరకు - అంటే దాదాపు 400 సం॥ వాళ్ళు తమ శపథాన్ని కాపాడు కున్నారు.

ఉదయపూర్ సమీపంలోని కుంభల్ ఘడ్‌ను 1485వ సం॥లో కుంభరాణా నిర్మించాడు. బ్రహ్మాండమైన ఆ కోట ప్రహరీగోడ ఆ ప్రాంతంలోని కొన్ని కొండల గుండా వెళుతుంది. 7 మీ॥ వెడల్పుగల



కుంభల్‌ఘడ్, ప్రహరీగోడ.

ఈ కోట గోడ మీద ఒక్కసారిగా 8 మంది అశ్వికులు స్వారీ చేయవచ్చు. ఈ కోట మీద చాలా సార్లు ముట్టడి జరిగింది. కాని అక్బర్ ఒక్కసారి మాత్రమే పట్టుకోగలిగాడు. అది కూడా స్వల్ప కాలమే తన అధీనంలో ఉంచుకోగలిగాడు.

రాణాథంభోర్ కోట 1192వ సం॥లో నిర్మించబడింది. ఇది కూడా అంతకు ముందున్న కోట ప్రదేశంలో – ఏడు కొండలను కలుపుతూ నిర్మించబడింది. భరత్‌పూర్, ఆగ్రా, జయపూర్, చిత్తోర్, గ్వాలియర్



రాణాథంభోర్ (ఎడమ వైపు) కు బయట తాత్కాలికంగా ఏర్పరచిన కోట నుంచి కాల్పులు జరుపుతూన్న మొగలుసైనికులు (కుడి వైపు)

కోటలకు సమాన దూరంలో కీలకమైన ప్రదేశంలో ఈ కోట నిర్మించబడింది. కొండలమధ్య, దట్టమైన అడవులతో ఉన్న ఈ కోట దురాక్రమణదారుల మార్గానికి బలమైన అవరోధంగా నిలిచింది.

1209 - 1569 మధ్యకాలంలో దీని మీదికి 13 సార్లు దాడి జరిగింది. హమ్మీర్ దేవా కాలంలో, తిరగుబాటు చేసిన అల్లాఉద్దీన్ ఖిల్జీ సేనాధిపతి ఒకడు కోరడంతో అతనికి ఇక్కడ ఆశ్రయం ఇవ్వబడింది. ఆ సమయంలో అల్లాఉద్దీన్ ఖిల్జీ సేనలు ముట్టడి జరిపాయి. కాని పట్టుకోలేక పారిపోయాయి.

1301వ సం॥లో జరిగిన రెండవ ముట్టడికి అల్లాఉద్దీన్ స్వయంగా నాయకత్వం వహించాడు. ఆ సమయంలో హమ్మీర్ మంత్రులిద్దరుద్రోహంతలపెట్టారు. వారి కుట్ర ఫలితంగా కోట పతనమయింది. యుద్ధంలో హమ్మీర్ మరణించాడు. సాహస వీరుడయిన ఆయన సేనాధిపతి మహమ్మదు షాను శత్రువులు పట్టుకుని చంపేశారు.



1569వ సం॥లో ఈ కోటను అక్బర్ ముట్టడించాడు. కోట గోడలను పగలగొట్టడానికి 200 ఎడ్లు పూన్చిన బళ్ళమీద బ్రహ్మాండమైన ఫిరంగులు తెచ్చారు. కాని కోటను పట్టుకోవడం మాత్రం సాధ్యంకాలేదు. ముట్టడి కొంతకాలం కొనసాగింది. ఆఖరికి అక్బర్, అంబర్ రాజా భగవాన్‌దాస్‌ను, రాణా థంభోర్ రాజు రావు సూర్జన్ హడా వద్దకు శాంతి మంతనాలకు పంపాడు. ఒప్పందం ఏర్పడి ఆ ప్రాంతంలో మళ్ళీ శాంతి నెలకొన్నది. కోట చుట్టూ ఉన్న అడవి ఇప్పుడు పులుల శరణాలయంగా మారింది.

మార్వార్ రాజధాని మాండోర్. 15వ శతాబ్దంలో రాథోడ్ రాజు రావ్‌జోధా, రాజధానిని అక్కడి నుంచి 9 కి.మీ. దూరంలో ఉన్న కొండమీదికి మార్చాలని నిర్ణయించాడు. ఆయన తన పేరు మీదుగా జోధ్‌పూర్ అనే నగరాన్ని ఏర్పరచి 1459వ సం॥లో మెహ్రాన్‌ఘడ్ కోటను నిర్మించాడు.

ఈ ప్రాంతంలోని ఇతర కోటలలాగా కాకుండా, మెహ్రాన్‌ఘడ్ కోట మొగలుల, ఆఫ్ఘన్‌ల దాడుల కన్నా ఇరుగుపొరుగు రాజపుత్ర రాజుల దాడికి ఎక్కువగా గురయింది.

ఈ కోటలో ఇప్పటికీ కిల్‌కిలా, శంభుబాన్, ఘాజీఖాన్ అనే బ్రహ్మాండమైన ఫిరంగులు మంచి స్థితిలో పరిరక్షింపబడుతున్నాయి.



మెహ్రాన్‌ఘడ్, జోధ్‌పూర్.

 



# పోలయ్య నోటిదురుసు

పోలయ్యకు ఆస్తిపాస్తులు అంతగా లేకపోయినా, గ్రామంలో బంధుబలగానికేం కొదవ లేదు. ఆ ఆసరా చూసుకుని, మరి నా అంత వాడు లేడన్నట్టు ప్రవర్తించేవాడు. అతడికి నోటిదురుసు ఎక్కువ. అందుకు బావమరిది రంగయ్య మందలించేవాడు. కానీ పోలయ్యలో మార్పురాలేదు.

ఒకరోజున పోలయ్య పెరట్లో నూతి పళ్ళెం దగ్గర కాలుజారి పడిపోతూ, పక్కనేవున్న గన్నేరు చెట్టును పట్టుకుని నిలదొక్కుకున్నాడు. అయితే, అదేక్షణంలో చెట్టు ఊగడంతో కాలు మడత పడింది. అప్పుడే అటు వచ్చిన పోలయ్య భార్య సీతమ్మ, ఆ దృశ్యం చూసి కిలకిలా నవ్వింది.

అదిచూసి పోలయ్య కోపం పట్టలేక, "పతివ్రతలు పుట్టిన దేశంలో పుట్టి, మహాపతివ్రత పేరుపెట్టుకుని మొగుడు బాధపడుతూంటే నవ్వుతావా? ఇలాంటి సిగ్గులేని ఆడపుట్టుక పుట్టేకంటే, ఏ ఏట్లోనో దూకి చావకూడదూ?" అన్నాడు.

సీతమ్మ నవ్వుకుంటూనే అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

మడతపడ్డ కాలును పోలయ్య రెండు చేతులతో పట్టి సరిచేసుకున్నాడు. అయితే, కాలిమడమ నొప్పిచేసి అడుగు తీసి అడుగు వేయడం కష్టమయింది. ఎలాగో అడుగులు వేసి కుంటుకుంటూ పెరటి గుమ్మందాకా వచ్చాడు.

అప్పుడు వెనకనుంచి బావమరిది రంగయ్య అతణ్ణి పలకరించి, "ఏమిటి బావా! నూతిపళ్ళెంనుంచి పెరటి గుమ్మం దగ్గరకు అడుగు వెయ్యడానికి అంతసేపు పట్టింది?" అన్నాడు.

"అంటే — ఇంతసేపూ నువ్విక్కడే వుండి విడ్డూరం చూస్తున్నావన్నమాట. కాస్త చేయి ఆసరా ఇవ్వడానికి రాలేక పోయావా?" అన్నాడు పోలయ్య.

"వసుంధర"



"నువ్వు కుంటుతూంటే ఆ వయ్యారపు నడకలు చాలా అందంగా వున్నాయి, బావా! అలా చూస్తూ ఈలోకాన్నే మరచిపోయాను," అన్నాడు రంగయ్య.

"అన్నీ పెడబుద్ధులు. పెద్దవాడిని గౌరవించాలన్న ఇంగితం కూడా లేదు. ఇలాంటి బ్రతుకు బ్రతికే కంటే నూతిలో దూకి చావకూడదూ," అన్నాడు పోలయ్య కోపంతో.

రంగయ్య నవ్వుకుంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు. పోలయ్య ఇంట్లోకి వచ్చి గడప దాటి వీధి తలుపు తీసేసరికి, అక్కడికి కుంటుకుంటూ ఒక బిచ్చగాడు వచ్చి నిలబడి, "కుంటోణ్ణి బాబయ్యా! నాలుగు పైసలు ధర్మం యిప్పించండి," అన్నాడు.

పోలయ్య అతి కష్టం మీద నాలుగడుగులు వేసి, "నా కాలూ కుంటిదయింది. కానీ నేను నీలాగా అడుక్కుంటున్నానా?" అన్నాడు.

"అవసరంలేదు కాబట్టి అడుక్కోవడం లేదు. ఎలాగూ కుంటుతున్నారు గనక ఒక్కసారి నాలుగిళ్ళకూ వెళ్ళి అడుక్కుని చూడండి. నేనెంత కష్టపడుతున్నానో తెలుస్తుంది," అన్నాడు బిచ్చగాడు.

"దరిద్రపు వెధవా! కుళ్ళు గోతిలో పడి చావరా!" అన్నాడు పోలయ్య కసిగా.

బిచ్చగాడు నవ్వుకుంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

పోలయ్య కుంటుతూ పోయి వీధి అరుగు మీద కూర్చునే సమయానికి, వీధిలో నలుగురు పోకిరీ కుర్రవాళ్ళు ఆడుకుంటున్నారు. వాళ్ళాడే గోళీకాయో, గోటీబిళ్ళో ప్రతిరోజూ పోలయ్యకు ఒక్కసారైనా తగులుతూంటుంది. పోలయ్య వాళ్ళ మీద మండిపడుతూంటాడు.

ఈ రోజు వాళ్ళు కొత్త రకం ఆట ఆడుతున్నారు. పరీక్షించి చూస్తే—వాళ్ళలో ఒకడు కళ్ళు మూసుకుని గుడ్డివాడిలా నటిస్తున్నాడు. ఇంకొకడు చెవుల పక్కన చేతులు పెట్టి చెవిటివాడిలా నటిస్తున్నాడు. మరొకడు వ్యా వ్యా అని ధ్వనులు చేస్తూ మూగవాడిలా నటిస్తున్నాడు. మిగిలిన వాడు ఎత్తి ఎత్తి అడుగులు వేస్తూ కుంటివాడిలా నటిస్తూ, "మీ అందరి పేర్లు నాకు తెలియవుకాని, నా పేరు మాత్రం పోలయ్య!" అన్నాడు.

అంతా ఫక్కున నవ్వారు. వాడు అచ్చం పోలయ్యలాగే కుంటుతుంటే, గుడ్డివాడు కూడా కళ్ళు తెరిచేశాడు.

పోలయ్య తిట్ల దండకం మొదలుపెట్టాడు. నలుగురూ అక్కడి నుంచి పారిపోయారు.

ఇంతలో అక్కడికి ఒక మనిషి వచ్చాడు. పోలయ్య వాడినేనాడూ చూసి వుండలేదు. ఎవరివని ఆయన అడిగే లోపలే వాడు, "నేను సీతారామయ్య గారింట్లో కొత్తగా పాలేరు పనికి కుదిరానండి. పోలయ్య గారికి ఒక కబురు చెప్పి వెళ్ళాలండి," అన్నాడు.

"నేనేరా పోలయ్యని!" అన్నాడు పోలయ్య.

"అలా చెబితే నమ్మనండి. ఒకసారి నడిచి చూపించాలి. పోలయ్యగారు కుంటుతూ నడుస్తారని, ఇప్పుడే నలుగురు కుర్రాళ్ళు చెప్పారండి. పోలయ్య గారికి తప్ప ఇంకెవరికీ ఆ కబురు చెప్పొద్దని యజమాని గట్టిగా చెప్పాడండి," అన్నాడు పాలేరు.

"నేను నీకు నడిచి చూపించాలా? అంట్ల వెధవా? నీళ్ళులేని నాలుగు నిలువుల గోతిలో పడి చావు," అంటూ పోలయ్య, పాలేరును తిట్టడం మొదలు పెట్టాడు.

ఆ తిట్లన్నీ పూర్తయ్యాక పాలేరు, "ఇలా తిట్ట గలిగేది మీరొక్కరేనని కూడా యజమాని చెప్పాడండి. తమరే పోలయ్యగారని నాకు గట్టి నమ్మకం పుట్టిందండి. తమరు ఉన్న పళంగా కొత్తింటికి రావాలని యజమాని చెప్పాడండి," అన్నాడు.

"కొత్తిల్లంటే అదెక్కడ?" అని అడిగాడు పోలయ్య చిరాగ్గా.





ఆ తిట్లు పూర్తయ్యాక పాలేరు, "నేనేం తప్పుగా చెప్పలేదండి. నేను చెప్పిన వాటన్నిటికీ ఏదో ఒకకాలు కుంటండి!" అని వెళ్ళిపోయాడు.

సీతారామయ్యంటే పోలయ్యకు చాలా గౌరవం. అందుచేత ఆయన కష్టపడి కొత్తింటికి వెళ్ళాడు. దారిలో కుంటి కుక్క, కుంటి ఎద్దు, కుంటి దున్నలను చూస్తూంటే, ఆయనకు పట్టరాని ఉక్రోషం వచ్చింది.

కొత్తింట్లో అడుగుపెట్టగానే సీతారామయ్య ఎదురొచ్చి పోలయ్యను ఆప్యాయంగా పలకరించాడు.

"నువ్విక్కడెందుకున్నావు? ఈ ఇల్లు నారాయణది కదా!" అన్నాడు పోలయ్య.

"నారాయణ పొరుగూరు వెళుతూ ఇంటికి తాళం వేసి నాకిచ్చి, బంధువులొస్తే ఇల్లు వాడుకోమన్నాడు. నిన్ననే మా చిన్నాన్న కుటుంబం వస్తే, ఈ ఇంట్లో వుండమన్నాను. ఏమయిందోమరి–మా చిన్నాన్న మనవరాలు గౌరి, నిన్న ఎందుకో దడుసుకుని వెర్రి చూపులు చూడడం మొదలుపెట్టింది. అది మన వైపు చూడదు. మన మాట వినదు. దాన్నెలాగో అలా నవ్వించమనీ, ఒక్కసారి నవ్వితే మామూలు మనిషి అవుతుందనీ వైద్యుడు అన్నాడు. ఎంత ప్రయత్నించినా నవ్వించడం మా వల్లకాలేదు. అందుకని నీకు కబురు పెట్టాను," అన్నాడు సీతారామయ్య.

"ఇక్కణ్ణించి నాలుగిళ్ళు దాటాక సందొస్తుందండి. ఆ సందులో ఒక కుక్కపోలయ్య వున్నాడండి. దాన్ని దాటి వెళితే కుడి పక్క ఇంకో సందు. అందులో ఎద్దుపోలయ్య వున్నాడండి. అక్కడ కరివేపాకు చెట్టు బైటికి కనిపించే ఇంటినానుకుని ఇంకొక సందుందండి అందులో దున్న పోలయ్య వున్నాడండి. ఆ దున్నపోలయ్య నేఇంటి ముందు కట్టేశారో, అదే కొత్తిల్లండి," అన్నాడు పాలేరు.

ఇది వింటూనే పోలయ్య ఆగ్రహావేశుడైపోయి, "కోతిముఖం, గుడ్లగూబ కళ్ళు, గాడిద చెవులు – నీ కెంత పొగర్రా పాలేరు వెధవా! నాపేరును జంతువుతో కలిపి చెబుతావా?" అంటూ పాలేరును మరింత తిట్టాడు.

పోలయ్య ఆశ్చర్యపోతూ, "నీ వల్లకాని పని నా వల్ల అవుతుందా?" అన్నాడు.

"ఎందుకు కాదూ? నువ్వీ రోజు కుంటుతున్నావనీ, తమాషాగా నవ్వు పుట్టించేలా నడుస్తున్నావనీ ఊరంతా చెప్పుకుంటున్నారు. ఒక్కసారి మనవరాలి ముందు నాలుగడుగులు వెయ్యి," అన్నాడు సీతారామయ్య ప్రాథేయపడుతున్నట్టుగా.

సీతారామయ్య ఇలా అనగానే పోలయ్య ఉదయం నుంచీ పేరుకుపోతున్న ఉక్రోషం మరింతగా హెచ్చు మీరిపోయి, సీతారామయ్యను నానా మాటలూ అన్నాడు. అంతటితో అక్కసు తీరక గౌరిని ఎత్తుకుని, "ఏమే, కొండముచ్చు ముఖం నువ్వూ! వేలెడు లేవు, నీకూ నేనంటే వేళాకోళంగా వుందా? ఇలాంటి బుద్ధులుంటే ఊళ్ళో ఎందుకు? ఏ కొండ ముచ్చుల గుంపులోనో కలిసిపో!" అంటూ ఆగకుండా తిట్లుతిట్టాడు.

అంతే! ఉన్నట్టుండి గౌరి నవ్వడం ప్రారంభించింది. ఆ నవ్వు ఆగేసరికి పిల్ల మామూలు మనిషయింది.

పోలయ్య బిక్కచచ్చిపోయాడు. అందరూ పిల్ల మామూలు మనిషయినందుకు పోలయ్యను పొగడసాగారు. ఆయనకేమనాలో తెలియక, "అంటే – పిల్లకు జబ్బు చేయడం నిజమేనన్నమాట! దాన్ని నవ్వించడానికి అవసరమయిందనుకున్నవాళ్ళు, నా కుంటితనాన్ని వేళాకోళం చేస్తారేం? ఏదో కాలు మడతపడి నేను బాధపడుతూంటే, అది చూసి అందరూ వినోదిస్తారేం?" అన్నాడు బాధగా.

దానికి సీతారామయ్య నవ్వి, "నీ పరిస్థితి చూస్తే ఎవరికైనా జాలిగానే వుంటుంది. నా మాటలు అబద్ధమనుకుంటే చిన్నపిల్ల గౌరి కూడా చూడు, నీ తిట్లు వినే నవ్వింది," అన్నాడు.

తన నోటిదురుసు అందరి వినోదానికీ ఉపయోగపడుతున్నదని గ్రహించగానే, పోలయ్యకు చచ్చేటంత సిగ్గేసింది. ఆ తర్వాత నుంచి ఆయన శాంతం అలవాటు చేసుకుని క్రమంగా తన నోటిదురుసును తగ్గించుకున్నాడు.





# వైద్యుడి ఎన్నిక

లక్ష్మీపురం జమీందారు సూర్యభూపతి, ధర్మ బుద్ధీ, దయాహృదయమూ కలవాడు. సూర్య భూపతి జమీ చాలా పెద్దది. చుట్టుపక్కల గల నూరు గ్రామాలకుపైగా, ఆయన జమీకి సంబంధించినవే. ఆ గ్రామాలన్నిటిలోకి లక్ష్మీ పురం పెద్దది. సూర్యభూపతి ముత్తాతతండ్రి లక్ష్మీపురంలో ఒక ఉచిత వైద్యశాలను కట్టించాడు. సూర్యభూపతితరం వచ్చేసరికి, చుట్టు ప్రక్కల గ్రామాలనుంచికూడా రోగులు, లక్ష్మీ పురానికే వస్తూండేవారు. ఇందుకు కారణం, లక్ష్మీపురపు వైద్యశాలలో వైద్యం చేసే వృద్ధ వైద్యుడు నీలకంఠశాస్త్రి.

అటువంటి నీలకంఠశాస్త్రి, వృద్ధాప్యం కారణంగా కన్ను మూశాడు. ఆయన మరణం ప్రజలతోబాటు సూర్యభూపతికికూడా విచారం కలిగించింది. నీలకంఠశాస్త్రి ప్రధాన శిష్యులైన నలుగురిలో, ఏ ఒకరినైనా నియమించమని, ఆయనకు మిత్రులు సలహా ఇచ్చారు. సూర్య భూపతి, సంగతి తన ఆప్తమిత్రుడైన చంద్ర వర్మకు చెప్పి, సమస్యకు పరిష్కార మార్గం సూచించమని కోరాడు.

ఇందుకు చంద్రవర్మ, "భూపతీ! నీలకంఠ శాస్త్రి శిష్యులు నలుగురునీ, రేపు ఉదయం సరిగ్గా ఎనిమిది గంటలకు కచేరీకి రమ్మని కబురు చెయ్యి. వాళ్ళల్లో ప్రతిభావంతుడైన వ్యక్తిని ఎన్నిక చేసే బాధ్యత నాది," అంటూ సూర్యభూపతి చెయ్యవలసిన మరొకపని కూడా చెప్పి వెళ్ళాడు.

సూర్యభూపతి వెంటనే తన మనుషుల చేత, మిత్రుడు చెప్పిన విధంగా నీలకంఠశాస్త్రి శిష్యులకు కబురు చేశాడు. తాము ఊహించని విధంగా జమీందారు పంపిన వార్త విని నలుగురూ మర్నాటి ఉదయం ఎనిమిది కాకపూర్వమే కచేరికి చేరుకున్నారు.

అక్కడవున్న నౌకర్లు, వారిని సగౌరవంగా కూర్చోబెట్టి, "జమీందారుగారు ఏవో అత్యవ

లక్ష్మీ గాయత్రి

సర కార్యాలు చక్కబెడుతున్నారు. అన్యథా భావించక, తమను కొద్దిసేపు వేచివుండ మన్నారు," అని చెప్పారు.



అయితే జమీందారు ఎంతకూ రాలేదు. కచేరిలో పదకొండుగంటలు కొట్టారు.పన్నెండు గంటలు కాబోతూండగా జమీందారు సూర్య భూపతీ, చంద్రవర్మా వారున్నచోటుకువచ్చారు. తమను చూసి గౌరవంతో లేచి నిలబడి నమస్కరించిన వాళ్ళకేసి పరీక్షగా చూస్తూ కూర్చోవలసిందిగా చెప్పి, సూర్యభూపతితో పాటు చంద్రవర్మా కూర్చున్నాడు.

వైద్యశాస్త్రపు ఓనమాలు కూడా తెలియని వీళ్ళ ద్దరూ, తమను ఎలా పరీక్షిస్తారో అర్థంకాక ఆశ్చర్యపడుతూ ఆ వచ్చిన నలుగురూ చూడ సాగారు. ఇంతలో ఒక నౌకరు, ఒక గాజు కూజాలో సగానికి నీళ్ళు తీసుకువచ్చి, జమీం దారు ఎదురుగా బల్లమీద పెట్టి వెళ్ళాడు.

నౌకరు వెళ్ళిపోగానే చంద్రవర్మ, "ఇప్పుడు నేను మూడు ప్రశ్నలు వేస్తాను. మీరు నలు గురూ ఒక్కొక్కరుగా జవాబులు చెప్పండి," అని, మొదటగా జయంతుడనే యువకుణ్ణి లేచి రావలసిందిగా సైగచేసాడు.

జయంతుడు రాగానే, చంద్రవర్మ, అతడికి బల్లమీది గాజుకూజానుచూపిస్తూ,"జయంతా! దాన్ని గురించి ఒక వాక్యం చెప్పు!" అన్నాడు.

వైద్యం గురించినప్రశ్నలేవోవేస్తాడని ఆశిం చిన జయంతుడు,"ఆగాజు కూజాలో సగానికి నీళ్ళున్నవి," అన్నాడు చిరాకు అణచుకుంటూ.

"బాగుంది!" అని, చంద్రవర్మ అతడికి ఎదురుగా ఉద్యానవనంలో ఆకులన్నీరాల్చి, దాదాపు మోడుబారినట్టున్న ఒక వృక్షాన్ని చూపిస్తూ, "జయంతా! ఆ వృక్షం గురించి కూడా ఒక వాక్యం చెప్పు!" అన్నాడు.

ఈసారి జయంతుడు కాస్త చిరాకుగానే, "ఋతు ధర్మం ప్రకారం ఆ చెట్టు ఆకులన్నీ రాలుస్తున్నది," అన్నాడు.

"సరే, ఇక మూడో ప్రశ్న ఏమిటంటే, పై రెండు ప్రశ్నలూ నేను నిన్ను ఎందుకడిగి నట్టు?" అని ప్రశ్నించాడు చంద్రవర్మ.

జయంతుడు, ఈ ప్రశ్న వింటూనే తెల్లబోయి, ఏదో నోటికి వచ్చిన జవాబు వినీవినపడనట్లుగా చెప్పాడు.

ఇందుకు చంద్రవర్మ చిన్నగా నవ్వి, అతణ్ణి వెళ్ళి కూర్చోవలసిందిగా చెప్పి, మిగిలిన వారిని పిలిచాడు. ఆ వచ్చిన నరేంద్రుడూ, మోహనుడూ కూడా ఇంచుమించు జయం తుడిలాగే ప్రవర్తించి, కొద్దిపాటి మాటల తేడాలతో అతడి జవాబులే చెప్పారు. చివరకు వచ్చిన లలితుడు మాత్రం గాజు కూజాను చూస్తూ, "ఇప్పటికే సంగం నిండి వున్న ఈ కూజాను పూర్తిగా నింపడం మరింత సులభం!" అన్నాడు. ఆ జవాబు విన్న సూర్యభూపతి అప్రయత్నంగా, "శభాష్" అన్నాడు.

తర్వాత లలితుడు వృక్షానికేసి చూస్తూ, "ఈ శిశిర ఋతుధర్మం ప్రకారం ఆకులు రాలుస్తున్న ఆ వృక్షం, హేమంతంరాగానే, నిండుగా పచ్చటి ఆకుల్ని నింపుకుని కళ కళ్ళాడుతుంది!" అన్నాడు. అప్పుడుచంద్రవర్మ "ఇక ఆఖరు ప్రశ్నకు జవాబు మాతో బాటు నీ సహచరులకు కూడా చెప్పు," అన్నాడు.

లలితుడు వినయంగా, "వైద్యశాస్త్రాల న్నింటిలోకి కీలకమైనది మనస్తత్వశాస్త్రం. శారీరకంగా ఏదైనా రుగ్మతరాగానే మనిషి ముందు కొద్దో గొప్పో తన మనోబలాన్ని కోల్పోతాడు. అతడికి వైద్యం చేసే వైద్యుడు, తన ఆశాపూరితమైన మాటలతో, అతడి మనోబలాన్ని పునరుద్ధరించాలి. అప్పుడే వైద్యుడి చేతి మందు అమృతతుల్యమై వ్యాధిని నయం చేస్తుంది. ఆ మనస్తత్వ శాస్త్రపు అంశాన్నే మీరు ఈ కూజా ద్వారా, ఆ వృక్షం ద్వారా ప్రశ్నించారు," అన్నాడు.

ఆ జవాబుకు చంద్రవర్మ చిరునవ్వు నవ్వి, "లలితా! నీలకంఠశాస్త్రి శిష్యుడివనిపించావు. అయితే, ఇంకొక్క విషయం! తనవద్దకు వచ్చే రోగులతో మృదువుగా, ఆశాపూరితంగా మాట్లాడే వైద్యుడికి సహనం, ఓర్పు కూడా ఒకపాలు ఎక్కువే కావాలి సుమా!" అన్నాడు.

నాలుగు గంటలసేపు వేచి వుండలేక, తనుకూడా కాస్త చిరాకు పడిన విషయాన్నే, చంద్రవర్మ ఎత్తి చూపిస్తున్నాడని గ్రహించిన లలితుడు, "ప్రభూ! అభ్యాసంతో సహనమూ, ఓర్పూ కూడా సాధిస్తాను," అన్నాడు.

చంద్రవర్మనిర్ణయాన్నిగ్రహించినజమీందారు, మిత్రుడివైపూ, వైద్యుడివైపూ తృప్తిగా చూశాడు.






హిడింబ తనను అభిమానించి, తన భార్య కాగోరినట్టు చెప్పేసరికి భీముడు ఆమెతో, "ఇది ఎలా సాధ్యం? నేను నిన్ను వివాహమాడడంకోసం వీళ్ళందర్నీ నీ అన్నకు ఎలా బలి చెయ్యను?" అన్నాడు.

"నీ తల్లికీ, సోదరులకూ మా అన్న భయం లేకుండా నేను చూస్తానన్నాను గద! వీళ్ళందరినీ నిద్రలేపు," అన్నది హిడింబ.

"సుఖంగా నిద్రపోతున్నారు, వీరిని లేపటం నా కిష్టం లేదు. ఇక నీ అన్న అంటావా? ఏ రాక్షసుడి భయమూ నాకు లేదు. ఎలాటివాణ్ణయినా క్షణంలో చంపి పారేసే బలం నాకున్నది," అన్నాడు భీముడు.

ఈ లోపల హిడింబుడు, తన చెల్లెలు ఎంతకూ తిరిగి రాకపోవటం చూసి, చెట్టు మీదనుంచి దిగి, తానే పాండవులున్న చోటికి బయలుదేరాడు. తన అన్న చాలా కోపంగా వస్తూండటం దూరంనుంచే గమనించి హిడింబ భీముడితో, "మా అన్న యముడి లాగా వస్తున్నాడు. మీరందరూ ఇక్కడ దేనికి? మిమ్మల్ని ఆకాశ మార్గాన తీసుకుపోయి క్షేమకరమైన చోట దించుతాను," అన్నది.

"రాక్షసీ, నువ్వు భయపడకు, నీ అన్న చావు మూడటం చేతనే ఇక్కడికి వస్తున్నాడు. వీడే కాదు, వీడి బంధువులైన రాక్షసులందరూ వచ్చినా అందరినీ యముడి దగ్గరికి పంపిస్తాను. నేను ఈపని ఎలా చేస్తానో చూసి నువ్వు ఆనందింతువు గాని," అన్నాడు భీముడు.

"ఏమో, మా అన్న అనేకమార్లు మనుషలను ఎంత దారుణంగా చంపాడో చూశాను



గనక చెప్పాను. అంతకన్న మరేమీ లేదు," అన్నది హిడింబ.

ఇంతలో హిడింబుడు దగ్గిరికి రానే వచ్చాడు. తన చెల్లెలు ధరించిన అందమైన బట్టలూ, అవతారమూ చూసి, 'ఓహో, దీనికి ప్రేమజాడ్యం పుట్టినట్టు వున్నది,' అనుకుని, అమితమైన క్రోధంతో కళ్ళు అతి భయంకరంగా తిప్పుతూ దానిని సమీపించి, "ఓసీ, హిడింబా! నేను అక్కడ ఆకలితో మాడి చస్తూంటే నువ్వు కులుకుతూ ఎవరిని సమ్మోహింప జేయాలని చూస్తున్నావు? మన రాక్షస మర్యాదలను మంటగలిపి, మనుష లతో సంబంధాలు పెట్టుకుని, నాకు ద్రోహం తలపెడతావా? వీళ్ళను చంపి నీ ప్రాణం కూడా తీస్తానుండు," అంటూ భీముడి కేసి తిరిగాడు.

"ఒరే, రాక్షసాధమా! నిన్ను చంపి ఈ అర ణ్యంలో నీ పీడ లేకుండా చేస్తాను," అన్నాడు భీముడు.

హిడింబుడు చేతులు చాచి భీముడి మీదకు వచ్చాడు. భీముడు లాఘవంగా వాణ్ణి పట్టుకుని, ఎనిమిది బారల దూరం ఈడ్చుకు పోయాడు. అంతలో హిడింబుడు భీముడి పట్టు విడిపించుకుని, భీముణ్ణి గట్టిగా వాటే సుకుని, భయంకరంగా పెడబొబ్బ పెట్టాడు.

వాడి పెడబొబ్బలకు తల్లీ, సోదరులూ లేస్తారనుకుని, భీముడు వాడి పట్టునుంచి తప్పించుకుని, తానే వాణ్ణి పట్టుకుని మరింత దూరంగా ఈడ్చుకు పోయాడు. భీముడు మామూలు మనిషి కాడని హిడింబుడు గ్రహించి, హెచ్చిన దీక్షతో భీముడితో తలప డ్డాడు.

ఇద్దరూ యుద్ధం ఆరంభించేసరికి భూమి అదిరింది, చెట్లూ తీగెలూ కూలాయి. కుంతీ, మిగిలిన పాండవులూ నిద్ర లేవనే లేచారు. తమ సమీపంలో శృంగారం మూర్తీభవించి నట్టుగా ఉన్న హిడింబను చూసి కుంతీదేవి మెల్లిగా, "అమ్మాయీ, నిన్ను చూస్తే ఏ వన దేవతవో, అప్సరసవో అన్నట్టున్నావు, ఎవరు నువ్వు? ఎక్కడినుంచి ఎక్కడికి పోతూ ఇటుగా వచ్చావు? నీ సంగతి కాస్త వివరంగా చెప్పు," అని అడిగింది.

హిడింబ కుంతీదేవితో ఉన్నమాట చెప్పేసింది:

"అమ్మా, నేనూ, నా అన్న అయిన హిడింబుడనే రాక్షసుడూ ఈ అరణ్యంలోనే నివసిస్తున్నాం. మిమ్మల్నందరినీ తినటానికి తీసుకు రమ్మని మా అన్న పంపగా నేను వచ్చాను. కాని నీ కొడుకు అందం చూసి అభిమానించి మా అన్న చెప్పిన పని చేయలేకపోయాను. నీ మనసు నీ కొడుక్కు విప్పి చెప్పాను కూడా. ఇంతలో మా అన్న వచ్చాడు. నీ కొడుకు అతన్ని దూరంగా లాక్కుపోయాడు. అక్కడ ఇప్పుడిద్దరూ హోరాహోరి పోట్లాడుకుంటున్నారు."

హిడింబ ఈ మాట చెప్పగానే ధర్మరాజూ, అర్జున నకుల సహదేవులూ లేచి యుద్ధం జరుగుతున్న చోటుకు వెళ్ళి, భీమ హిడింబుల పోరాటాన్ని కొంత దూరంలో ఉండి చూడసాగారు. ఇద్దరూ రెండు సింహాలలాగా పోరాడుతున్నారు. కార్చిచ్చు వల్ల పుట్టే పొగలాగా దుమ్ము లేచి వారిని చుట్టేసింది. పోరాటంలో హిడింబుడిదే పైచెయ్యిగా ఉండటం గమనించి అర్జునుడు, "భీమసేనా, నువ్వు అలిసిపోయి ఉంటే నన్ను వీడితో కాస్సేపు పోట్లాడనీ," అన్నాడు.

"అర్జునా, తొందర పడకు, నాకు ఒకసారి చిక్కి వీడు నా చేత చావక ఏమవుతాడు?" అన్నాడు భీముడు.

"అలా అయితే వీణ్ణి త్వరలో చంపెయ్యి. మనం ఇక్కడ మసలటం అంత మంచిది కాదు. తూర్పున అరుణోదయం కూడా





కంట పడకుండా మనం తప్పుకుపోవాలి," అన్నాడు.

కుంతితో సహా పాండవులు అతి వేగంగా కదిలారు. హిడింబ కూడా వాళ్ళను వెంబడించి రాసాగింది. భీముడు, "హిడింబా, ఈ మోహినీరూపంలో మీ అన్న కోసం పగ తీర్చుకుందామనుకుంటున్నావా? వెళ్ళిపో. లేకపోతే మీ అన్నను చంపినట్టే నిన్నూ చంపెయ్యగలను," అన్నాడు.

అదివిని ధర్మరాజు, "అదేమిటి, తమ్ముడూ? ఆడదాన్ని చంపుతానంటావేమిటి? ఈమెకు మన పైన కోపం ఉంటే మటుకు మనని ఏమి చేయగలదు? హిడింబుడు చంపదగినవాడే, వాణ్ణి చంపి మంచి పని చేశావు. కాని వాడి చెల్లెలన్న కారణం చేత దీన్ని కూడా చంపుతావా? తప్పు, తప్పు," అన్నాడు.

హిడింబ ధర్మరాజు కాళ్ళూ, కుంతీదేవి కాళ్ళూ తాకి, "నేను ఆశ కొద్దీ నావాళ్ళనూ, నా రాక్షస ధర్మాన్నీ వదిలి మీ అబ్బాయిని వరించాను. అతను నన్ను నిరాకరిస్తే నేను ప్రాణం తీసుకుంటాను. నా ప్రాణాలను నిలబెట్టి పుణ్యం కట్టుకోండి. మీకేదన్నా ఆపద వచ్చేటట్టుంటే నాకు చెప్పండి. మిమ్మల్నందరినీ అవలీలగా అరణ్యాలు దాటించగలను," అన్నది.

ధర్మరాజు ఆమెతో, "హిడింబా, నీ మాటలు నమ్మాను. భీముడు నిన్ను స్వీకరిస్తాడు. పగలల్లా మీరు యథేచ్ఛగా విహరించండి. కాని

అయింది. సంధ్యవేళల్లో రాక్షసులకు బలం పెరుగుతుంది. వీడితో ఆడుతూ కూర్చోకు. అవసరమైతే నా బాణాలతో వీడి తల నరికేస్తాను," అన్నాడు అర్జునుడు.

ఈ మాట విని భీముడు అమితమైన ఆవేశం తెచ్చుకుని, హిడింబుణ్ణి పట్టి గిరగిరా తిప్పి, కిందవేసి కొట్టి, వాడి నడుము విరిచి, చిత్రవధ చేశాడు. హిడింబుడు పెద్దగా అరుస్తూ ప్రాణాలు వదిలాడు.

భీముణ్ణి అతని తల్లీ, ధర్మరాజూ, మిగిలిన వాళ్లూ అభినందించారు. అర్జునుడు ఘనంగా పొగిడాడు. తరవాత అతడు, "దూరాన ఏదో గ్రామం కనిపిస్తున్నది. మనం త్వరగా అక్కడికి వెళ్ళటం మంచిది. దుర్యోధనుడి వేగులవాళ్ళ



నెత్తిన ఒక్క వెంట్రుక అయినా లేకపోవటమూ, తల కుండలాగా ఉండటమూ చూసి హిడింబ ఆశ్చర్యపడింది. అప్పుడే వాడికి ఘటోత్కచుడనే పేరు వచ్చింది. (ఉత్కచమైన ఘటం అంటే కేశరహితమైన కుండ అని అర్థం.)

ఘటోత్కచుడు తల్లిదండ్రులకు మొక్కి "మీకు నా వల్ల ఏదన్నా పనిపడితే నన్ను తలుచుకోండి. వెంటనే మీ ఎదట నిలుస్తాను," అని చెప్పి, ఉత్తరంగా వెళ్ళిపోయాడు. హిడింబ కూడా ముందు చేసుకున్న నియమం ప్రకారం భీముడి వద్ద సెలవు తీసుకుని తన దారిన తాను వెళ్ళిపోయింది.

తరవాత పాండవులు జడలు ధరించి, నారబట్టలు కట్టి, బ్రాహ్మణ కుమారుల వేషాలతో మత్స్యదేశమూ, త్రిగర్తదేశమూ, పాంచాలమూ, కీచకదేశమూ సంచరిస్తూ చాలా దూరం వెళ్లారు.

ఇలా దేశసంచారం చేస్తూండగా ఒకచోట వారికి వ్యాసుడు కనిపించాడు. అందరూ ఆయనకు నమస్కారాలు చేసి, దీనవదనాలతో చేతులు కట్టుకుని నిలబడ్డారు. వారిని చూసి వ్యాసుడు, "నాయనలారా, నాకు మీరు ఒకటీ ధృతరాష్ట్రుడి కొడుకులు ఒకటీ కాదు. కాని వాళ్ళు మీకు చాలా అన్యాయం చేశారు. ఇంత చిన్న వయసులో మీరీ కష్టాలు పడుతూంటే నాకు చాలా జాలిగా ఉన్నది. ఇలా ఆపదల పాలైనందుకు మీరు విచారించ

రాత్రివేళ మటుకు అతన్ని మేముండే చోట చేర్చు." అన్నాడు.

అందుకు హిడింబ సమ్మతించింది. హిడింబకు కొడుకు పుట్టేవరకూ ఆమెను తన భార్యగా చూసుకోవటానికి భీముడు కూడా ఒప్పుకున్నాడు. హిడింబ భీముణ్ణి తీసుకుని ఆకాశమార్గాన వెళ్ళిపోయింది. ఇద్దరూ పర్వత శిఖరాల పైనా, కొండ గుహల్లోనూ, నదీ తీరాలా, సరస్సుల వద్దా, అందమైన పొదరిళ్ళలోనూ విహరించారు. కాలక్రమాన హిడింబ గర్భవతి అయి, ఒక కుమారుణ్ణి కన్నది. వాడు పుట్టుతూనే కామరూపుడై, అప్పటికప్పుడే పెరిగి పెద్దవాడై, తల్లికీ, తండ్రికీ, మిగిలిన వారికీ మొక్కి నిలబడ్డాడు. వాడి

కండి. ఇక్కడికి దగ్గిరలోనే ఏకచక్రపురం ఉన్నది. అది అందమూ, ఆరోగ్యకరమూ అయిన ఊరు. మీరెవరో తెలియకుండా అక్కడ కొంతకాలం ఉండండి," అన్నాడు.

వ్యాసుడు స్వయంగా వారిని ఏకచక్రపురానికి తీసుకుపోయి, ఒక బ్రాహ్మణ గృహంలో వారికి బస ఏర్పాటు చేసి, కుంతితో, "అమ్మా, మీరిక్కడ ఒక నెల రోజులపాటు ఉండండి. నేను మళ్ళీ వచ్చి కనిపిస్తాను," అని చెప్పి వెళ్ళిపోయాడు.

కుంతీదేవీ, పాండవులూ ఆ బ్రాహ్మణ గృహంలో ఉంటూ, అందరితోనూ మంచిగా మెలగుతూ, భిక్షాటన చేసి జీవిస్తూ వచ్చారు. అయిదుగురూ తెచ్చిన ఆహారాన్ని కుంతీదేవి రెండుభాగాలు చేసి, సగం భీముడికి పెట్టి, మిగిలినది మిగిలిన పాండవులకు పెట్టి తాను కూడా తినేది, అందులోనే అతిథులకూ పెట్టేది. పాండవులు భిక్షమెత్తటంతో బాటు వేదాధ్యయనం చేసేవారు, చెరువుల్లో ఈతలు కొట్టి చెట్ల నీడను విశ్రమించేవారు. వారికి రోజులు సుఖంగా వెళ్ళిపోతున్నాయి.

ఇలా ఉండగా ఒకనాడు ధర్మరాజూ, అర్జునుడూ, నకుల సహదేవులూ ఊరిలో భిక్షాటన చెయ్యటానికి వెళ్ళారు. భీముడూ, కుంతీ ఇంట్లో ఉన్నారు. ఆ సమయంలో బ్రాహ్మణుడి ఇంటి నుంచి ఏడుపు వినిపించింది.

అది విని కుంతి భీముడితో, "పాపం, ఇల్లు గలవారికేదో ఆపద సంభవించినట్టున్నది. నిలవ నీడలేని మనను వాళ్ళు తమ ఇంట్లో ఉండనిచ్చి ఎంతో ఉపకారం చేశారు; మనం కూడా కొంత కాలంగా ఇక్కడ తల దాచుకుంటున్నాం. అందుచేత వారికి కలిగిన కష్టమేమిటో విచారించి, చేతనైతే ప్రత్యుపకారంచేద్దాం. అసలు ఏం జరిగిందో కనుక్కొని వస్తాను," అని చెప్పి బ్రాహ్మణ కుటుంబం ఉండే భాగానికి వెళ్ళింది.

ఆమె వెళ్ళే సరికి ఇల్లుగల బ్రాహ్మణుడు తన భార్యనూ, కూతుర్నీ, కొడుకునూ దగ్గిర పెట్టుకుని ఏడుస్తున్నాడు. వారి దుఃఖం చూసి కుంతి, "ఎందుకేడుస్తున్నారు?" అని అయినా అడగలేక, తాను కూడా వారికి కొంచెం దగ్గిరగా కూర్చున్నది.



# అసలువయసు!

ఒకానొక గ్రామంలోని కోదండయ్య అనే రైతుకు, పశువులకాపరి కుర్రాడు కావలసి వచ్చాడు. ఆయన గ్రామంలోని దళారి దానయ్యను పిలిచి, సంగతి చెప్పి, "పగలల్లా ఎండనక, వాననక పశువులతోపాటు ఊరిపొలిమేరల్లో తిరగవలసి వస్తుంది కదా! ఇరవైలోపు వయసువాణ్ణి చూడు," అన్నాడు.

దానయ్య, తన సాయానికిగాను, కోదండయ్య ఇచ్చిన పదిరూపాయలు రొండిన దోపుకుంటూ, "ఈమాత్రం నాకు తెలియదా! మాంచి చురుకైనవాణ్ణి, పదిహేనూ - పదిహేడూ మధ్య వయసువాణ్ణి, మీకు పనికి కుదురుస్తాను," అన్నాడు.

ఆ మర్నాడు కోదండయ్య దగ్గరకు ఒకడు వచ్చి, దణ్ణం పెట్టి, "బాబయ్యా! నాపేరు పీరయ్య. దళారి దానయ్య బాబు పంపగా వచ్చాను," అన్నాడు.

కోదండయ్య వాణ్ణి ఎగాదిగా చూసి, "ఆ దానయ్యకు నేను చెప్పింది, చిన్న కుర్రాణ్ణి పంపమని— ఇరవై ఏళ్ళ లోపు. నువ్వు చూడబోతే పాతికేళ్ళ వయసువాడిలా వున్నావు. ఊరి బయట తుమ్మల్లో, తుప్పల్లో తలా ఒకదారిన పరిగెత్తే పశువుల్ని, నువ్వేం మందేయగలవు," అన్నాడు.

దానికి పీరయ్య, "అలా అనకండి, బాబయ్యా! కాస్త బక్కచిక్కి వున్నా గనక, అలా కనబడుతున్నాను. నా వయసు పదిహేడేళ్ళే," అన్నాడు.

కోదండయ్య మౌనంగా ఒక క్షణం వూరుకుని, "సరే! ఆ కనబడే పాకలో చాపా అవీ వున్నవి. అందులో వుండు. జాగ్రత్త! పాకలో వున్న ఉప్పు బస్తాల్లోని ఉప్పును రాత్రి ఎలుకలు తినగలవు," అన్నాడు.

ఆ వెంటనే పీరయ్య ఆశ్చర్యంగా, "అదేంటి, బాబయ్యా! ఎలుకలు ఉప్పు తింటవన్న సంగతి, ఈ ముప్పై ఏళ్ళ వయసులో ఇదే మొదటిసారి వినడం!" అన్నాడు.

— కోటంరాజు రమాపతి



| చందమామ అనుబంధం - 78 | మనదేశపు చెట్లు |
| --- | --- |

# ఇప్పచెట్టు

ఎలుగుబంట్లకు తేనె అంటే ఇష్టమని అందరికీ తెలుసు. అదేవిధంగా ఉత్తర భారత దేశంలోని ఎలుగుబంట్లు ఇప్పపూలను ఎంతో ఇష్టంగా తింటాయి. అప్పుడప్పుడు మరీ ఎక్కువగా తినేసి, మత్తెక్కి తాగుబోతుల్లా ప్రవర్తిస్తాయి. ఉత్తరదేశం అడవులలో ఇప్పచెట్లు విపరీతంగాపెరుగుతాయి. అడవి ప్రాంతాలలోని ఆదిమజాతి ప్రజలు బియ్యం దొరకనప్పుడు ఇప్పపూలను ఆహారంగా తీసుకుంటారు. సాయంకాలం చెట్టు కింద శుభ్రం చేసి — రాత్రి పూచి తెల్లవారేసరికల్లా రాలిపోయే, లేత పసుపురంగు ఇప్పపూలను పోగుచేసి, ఎండబెట్టి నిలువచేసుకుని కావలసినప్పుడు తింటారు. ఈ పూలను పచ్చిగానూ, ఉడకబెట్టీ తింటారు. అక్రమాలకు పాల్పడిన ఆదిమ జాతి వారిని వేధించడానికి కొందరు మరాఠా పాలకులు అక్కడి ఇప్పచెట్లను నరికించేవారని చెబుతారు.

ఇప్పచెట్టును సంస్కృతంలో మధూకమనీ, గుజరాతీలో మహూదా అనీ, తమిళంలో ఇలుప్పై అనీ, మలయాళంలో ఇలుప అనీ, ఆంగ్లంలో ఇండియన్ బట్టర్ అనీ అంటారు. గంభీరంగా కనిపించే ఇప్పచెట్టు 20 మీ॥ ఎత్తు వరకు పెరుగుతుంది. కొమ్మల చివర అండాకారంలోని మెత్తటి ఆకులు గుబురుగా ఉంటాయి. పూలు కూడా కొమ్మల చివరే పూస్తాయి. గుజ్జుతో నిండి కోడిగుడ్డు ఆకారంలో వుండే దీని పళ్ళు ఆకుపచ్చ రంగులో ఉంటాయి. దీని కలప దృఢమైనదే కాని పువ్వులూ, పళ్ళూ విలువయినవి కాబట్టి, ఈ చెట్లను కలప కోసం నరకడం లేదు. ఇప్పగింజల నుంచి తీసే నూనెతో సబ్బులు, ఔషధాలు తయారు చేస్తారు. ఇప్పపువ్వులు, బెరడు, చెట్టు నుంచి కారే జిగురు మొదలైన వాటిని రకరకాల ఔషధాలు తయారు చేయడానికి ఉపయోగిస్తారు.



మనదేశపు ఋషులు - 2

# విశ్వామిత్రుడు

విశ్వామిత్రుడు రాజ్యాన్ని త్యజించి, తపస్సు చేసుకుంటున్నా వసిష్ఠుడి పట్ల ఏర్పడిన ఈర్ష్యా ద్వేషాలను జయించలేకపోయాడని వసిష్ఠుణ్ణి గురించి చదువుకున్నప్పుడు తెలుసుకున్నాం. విశ్వామిత్రుడిలోని బలహీనత అది. ఆఖరికి ఆయన ఆ బలహీనతను కూడా జయించి, వసిష్ఠుడి నోట బ్రహ్మర్షి అనిపించుకున్నాడు.

సత్యవ్రతుడనే రాకుమారుడు దుర్వ్యసన లోలుడై ఉండడంతో ఆగ్రహం చెందిన అతని తండ్రి అతన్ని రాజ్యం నుంచి బహిష్కరించాడు. అతడు అరణ్యానికి వెళ్ళాడు. ఆ అరణ్యంలోనే విశ్వామిత్రుడు భార్యాబిడ్డలతో తపస్సు చేసుకుంటున్నాడు. విశ్వామిత్రుడు అక్కడ లేనప్పుడు ఆ ప్రాంతాన్ని తీవ్రక్షామం పీడించింది. ఆ సమయంలో సత్యవ్రతుడు విశ్వామిత్రుడి భార్యాబిడ్డలకు ఆహారం ఇచ్చి కాపాడాడు. ఒకనాడు సత్యవ్రతుడికి ఆహారం ఏదీ లభించకపోవడంతో, వసిష్ఠ ఆశ్రమానికి చెందిన ఒక జంతువును చంపి, దాని మాంసం తాను కొంత తిని, మిగతా విశ్వామిత్రుడి కుటుంబానికి ఇచ్చాడు. ఆసంగతి తెలియడంతో ఆగ్రహావేశం చెంది వసిష్ఠుడు అతన్ని శపించాడు.

విశ్వామిత్రుడు కుటీరానికి తిరిగివచ్చి, క్షామకాలంలో సత్యవ్రతుడు తన కుటుంబానికి చేసిన ఉపకారం తెలుసుకుని సంతోషించాడు. అతని పట్ల కృతజ్ఞత, అభిమానం పెంచుకున్నాడు.

సత్యవ్రతుణ్ణి క్షమించి, అతని తండ్రి కొన్నాళ్ళకు అతన్ని రాజధానికి పిలిపించాడు. తండ్రి మరణానంతరం సత్యవ్రతుడు రాజయ్యాడు. సత్యవ్రతుడికి బొందెతో స్వర్గానికి వెళ్ళాలన్న కోరిక కలిగింది. అందుకు చేయవలసిన యజ్ఞం చేయమని కులగురువయిన వసిష్ఠుణ్ణి వేడాడు. కాని వసిష్ఠుడు అటువంటి యజ్ఞం ఏదీ లేదు; మానవ శరీరంతో స్వర్గానికి వెళ్ళడం అసాధ్యం అన్నాడు. అయినా, సత్యవ్రతుడు వినిపించుకోలేదు. ఇద్దరి మధ్యా మాటా మాటా పెరిగి, వసిష్ఠుడు సత్యవ్రతుణ్ణి 'త్రిశంకువు' (మూడు పాపాలు చేసిన వాడు) కమ్మని శపించాడు.

త్రిశంకు విశ్వామిత్రుణ్ణి ఆశ్రయించి తన కోరిక తెలియజేశాడు. వసిష్ఠుడికన్నా, తాను గొప్పవాడని నిరూపించడానికి తగిన అవకాశం లభించిందని, విశ్వామిత్రుడు ఉత్సాహంగా యజ్ఞం ప్రారంభించాడు. ఆ యజ్ఞ ప్రభావంతో త్రిశంకు, స్వర్గద్వారం వరకు వెళ్ళగలిగాడు. కాని ఆ తరవాత దేవతలు అడ్డుపడి కిందికి తోశారు. భూమి మీదికి పడిపోతూ అతడు విశ్వామిత్రుణ్ణి పిలిచాడు. "అక్కడే ఆగు!" అని అరిచాడు విశ్వామిత్రుడు. త్రిశంకు ఆకాశంలోనే తల్లకిందులుగా ఉండిపోయాడు. విశ్వామిత్రుడు తన తపోశక్తిని ధారపోసి, అక్కడ మరొక స్వర్గాన్ని సృష్టించాడు. అదే త్రిశంకు స్వర్గమయింది. తపోశక్తితో సాధించలేనిది ఏదీ లేదు; సృష్టికి ప్రతిసృష్టి చేసిన మహనీయుడు విశ్వామిత్రుడు అని ఇది తెలియజేస్తుంది!

విశ్వామిత్రుడికి తపోభంగం చేయడానికి ఇంద్రుడు ఒకసారి మేనక అనే అప్సరసను పంపాడు. విశ్వామిత్రుడు మనసు చలించి ఆమెతో కొన్నాళ్ళు గడిపాడు. వాళ్ళకు ఒక ఆడ శిశువు జన్మించింది. ఆమె శకుంతలగా పెరిగి పెద్దదై, దుష్యంతుణ్ణి వివాహమాడి భరతుడికి జన్మనిచ్చింది. భరతుడు పాలించడం వల్లే మన దేశానికి భారతదేశం అని పేరు వచ్చిందని చెబుతారు.

హరిశ్చంద్రుడు అష్టకష్టాలు పడడానికీ, అదే సమయంలో ఆయన కీర్తి ప్రతిష్ఠలు దశదిశలా వ్యాపించడానికీ ఒకవిధంగా విశ్వామిత్రుడే కారణంఅని చెప్పవచ్చు. ఎటువంటి విపత్కర పరిస్థితిలోనైనా సరే ఆడినమాట తప్పనివాడు హరిశ్చంద్రుడు అని వసిష్ఠుడు దేవలోకంలో అంటే - కాదు అతడూ మానవమాత్రుడే; అతని నోట అబద్ధం చెప్పిస్తానని పంతానికి దిగాడు విశ్వామిత్రుడు. అక్కడి నుంచి హరిశ్చంద్రుడి దగ్గరికి వెళ్ళి, పథకం వేసి, రాజ్యాన్ని హస్తగతం చేసుకుని, ఆతరవాత ఇంకా బాకీ ఉన్నాడని దానిని చెల్లించమని మనిషిని వెంట పంపి పీడించాడు. చక్రవర్తి అయిన హరిశ్చంద్రుడు ఆడిన మాట కాపాడుకోవడానికి సర్వస్వాన్నీ పోగొట్టుకుని, కాశిలో తన భార్యాబిడ్డలను ఒక బ్రాహ్మడికి విక్రయించి, తానొక కాటికాపరిగా మిగిలిపోయాడు. పాము కాటుకు గురై కొడుకు చనిపోతే శ్మశానానికి మోసుకు వచ్చిన భార్యను చూసి సుంకం చెల్లించమన్నాడు. ఆయన సత్యవ్రతానికి మెచ్చి, దేవతలు ప్రత్యక్షమై ఆయనకు రాజ్యాన్నీ భార్యా పిల్లలనూ తిరిగి ఇవ్వడం జగద్విదితమైన ఉదంతం.

ఆవిధంగా హరిశ్చంద్రుడి సత్యవ్రతాన్ని ముల్లోకాలు తెలుసుకునేలా చేసి, ఆయన కీర్తిని చిరస్థాయిగా నిలబెట్టినవాడు విశ్వామిత్రుడు!



# మీకు తెలుసా?

1. మనదేశంలో 'ఏడుగురు అక్కచెల్లెళ్ళు' అని పిలువబడే రాష్ట్రాలు ఏవి?
2. డైనమోను ఎవరు కనుగొన్నారు?
3. సునీల్ గవాస్కర్ ఫస్ట్ క్లాస్ క్రికెట్ నుంచి ఎప్పుడు విరమించాడు?
4. ఆఫ్రికాఖండంలోని అతి పెద్ద నగరం ఏది?
5. తుళుభాషను మనదేశంలో ఏ ప్రాంతంలో మాట్లాడతారు?
6. సాహసవీరులుగా పేరొందిన 'సమూరై' తెగ సైనికులు ఏదేశానికి చెందినవారు?
7. మనదేశంలో వెలువడుతున్న అతి ప్రాచీనమైన వార్తాపత్రిక ఏది?
8. ప్రపంచంలోకెల్లా చాలా పెద్దగంట ఏది?
9. మౌర్యవంశ స్థాపకుడు ఎవరు?
10. 'టునీషియా' ప్రాచీన నామం ఏది?
11. అహ్మదాబాదు ఏ నదీతీరంలో ఉన్నది?
12. లంకకు చేరడానికి శ్రీరాముడు నిర్మించాడని చెప్పుకునే 'సేతువు' ఈనాటి పేరేమిటో తెలుసా?
13. ప్రపంచంలోకెల్లా అతి పెద్ద 'అఖాతం' ఏది?
14. ఉత్కళ దేశంగా పేరొందిన ప్రాంతం ఈనాటి పేరేమిటి?
15. 'టెస్ట్ మేచ్'లో పాల్గొన్న మొట్టమొదటి భారతీయుడు ఎవరు?
16. టెలివిజన్‌ను ఎవరు కనుగొన్నారు?

## సమాధానాలు

1. అరుణాచల్ ప్రదేశ్, అస్సాం, మణిపూర్, మేఘాలయ, మిజోరం, నాగాల్యాండ్, త్రిపుర.
2. మైకేల్ ఫ్యారడే.
3. 1987 నవంబర్‌లో.
4. ఈజిప్టు రాజధాని కైరో.
5. దక్షిణ కర్నాటకలో.
6. జపాన్.
7. బాంబే సమాచార్.
8. మాస్కోలోని 'దిగ్రేట్ బెల్.'
9. చంద్రగుప్త మౌర్యుడు.
10. కార్తేజ్.
11. సబర్మతి.
12. ఆడమ్స్ బ్రిడ్జ్.
13. బంగాళాఖాతం.
14. ఒరిస్సా.
15. కె.ఎస్. రంజిత్‌సింగ్.
16. జాన్ లాగీ బాయిర్డ్.



# సుప్రతీకుడి ప్రశ్నలు

రత్నగిరి రాజు సత్యాకరుడు చక్కని సాహితీ ప్రియుడు. తన ఆస్థానంలో ఎంతోమంది కవిపండితులకు ఆశ్రయం ఇచ్చి పోషించేవాడు. ప్రతిభ అనేది కనుచూపుమేరలో ఎక్కడవున్నా పిలిపించి పట్టం కట్టడం సత్యాకరుడి అభిలాష.

ఒకసారి ఆయన తన ఆస్థానంలో సర్వకళా సమ్మేళనం ఏర్పాటు చేశాడు. అప్పుడు జరిగిన వాగ్వివాదాలలో, పాండితీ పరీక్షలలో, తన ఆస్థానంలోని కవిపండితులు, దేశవిదేశాల నుంచి వచ్చిన ఎంతోమంది పండితులను చిత్తుగా ఓడించారు. రత్నాకరుడికి తన కవిపండితుల ప్రతిభాపాటవాలు మరింత ఆహ్లాదాన్ని కలిగించాయి.

సత్యాకరుడు తన పండితుల ప్రతిభకు, వారి విజయానికి చిహ్నంగా పంచలోహంతో ఉద్దండులైన శిల్పుల చేత చక్కని నగిషీ పనితో ఒక గంటను తయారు చేయించి, తన ఆస్థానంలో వేళ్ళాడ దీయించాడు. ఆ గంట తన ఆస్థాన ప్రతిష్ఠకు సంకేతమనీ, తమ పండితులను ఓడించినవారికి, ఆగంటను బహుమానంగా ఇవ్వడమేగాక, లక్షవరహాల పారితోషికంతో ఘనంగా సన్మానం జరిపించగలననీ, చాటింపు వేయించాడు. అది విని, ఎంతోమంది రత్నగిరికి వచ్చి, ఆస్థాన పండితులతో వాదించి ఓటమిపాలై వెనుదిరిగిపోసాగారు. ఈ సంగతి తెలిసిన కంకణుడు అనే పండితుడు రత్నగిరికి వచ్చాడు. ఆయన బహుభాషావేత్త, మహామేధావి.

కంకణుడికీ, ఆస్థానపండితులకూ మధ్య రెండు రోజులపాటు వాదన జరిగినా గెలుపూ-ఓటమి తేలలేదు. మూడవనాడు కంకణుడు గెలిచే సూచనలు కనపించినై. రాజధాని ప్రజలు ఎంతో ఆతృతగా ఫలితం కోసం చూడసాగారు. వీధుల్లో ఏ ఇద్దరు తారసపడినా జరుగుతున్న పోటీల గురించి ముచ్చట్లే.

దాసరి వెంకటరమణ

నాల్గవనాడు కంకణుడు గెలిచినట్టు ప్రకటించబడింది. ఆస్థానపండితులు ఓటమితో తలలు వంచుకున్నారు. రాజుతోపాటు చాలా మందిని కంకణుడి విజయం కలతపరిచింది. అన్న ప్రకారం రాజు సత్యాకరుడు, కంకణుణ్ణి ఘనంగా సత్కరించి, లక్షవరహాల ధనమూ, గంటనూ ఇచ్చి సాగనంపాడు.

విజయగర్వంతో పల్లకీలో రత్నగిరి వదిలి వెళుతున్న కంకణుణ్ణి, నగరం వెలుపల సుప్రతీకుడనే పసులకాపరి యువకుడు అడ్డగించాడు. వాడికి కంకణుడి మీద విపరీతమైన కోపంగా ఉన్నది. వాడు కళల పట్ల ఎంతో అభిమానం కలవాడు. ఆస్థానపండితులంటే గొప్ప గౌరవం. వాళ్ళ ఓటమి వాడికి తల కొట్టేసినట్టయింది.

వాడు కంకణుడికి ఎదురుగా వచ్చి, "అయ్యా! ప్రజలను కన్న బిడ్డల్లా ఆదరించే రాజు సత్యాకరుడు మాకు దైవసమానుడు. ఆయనకు ఆస్థాన ప్రతిష్ఠ ఊపిరిలాంటది. ఆ ప్రతిష్ఠకు చిహ్నమైన ఈ గంట మా నగర పొలిమేర దాటకుండా ప్రయత్నించ వచ్చా?" అని అడిగాడు.

కంకణుడు, వాణ్ణి ఒకసారి నఖశిఖపర్యంతంపరీక్షగా చూసి, తలాడిస్తూ హేళనగా నవ్వాడు. ఆ నవ్వు పసులకాపరి సుప్రతీకుడికి చాలా కోపం తెప్పించింది. వాడు కాస్త తీవ్ర స్వరంతో, "అలా నవ్వకండి! మీరు మహాపండితులు, నేను పామరుణ్ణి. అయినా, నాకున్న కొద్దిపాటి లోకజ్ఞానంతో మిమ్మల్ని మూడు ప్రశ్నలడుగుతాను. వాటిల్లో మీరు రెండింటికి



సరైన సమాధానం చెప్పి, ఒక్కదానికి చెప్పలేక పోయినా, ఈ గంటను ఇక్కడ వదిలివెళ్ళాలి. రెండింటికి సమాధానం చెప్పలేకపోయినట్ట యితే, ఆ లక్ష వరహాల బహుమానం కూడా ఇచ్చి వెళ్ళాలి. మూడు ప్రశ్నలకూ సమాధానం చెప్పలేకపోతే, మీరు పల్లకీ దిగి, గంటను మాత్రం పల్లకీలో వుంచి, దాన్ని స్వయంగా మా రాజుగారికి అందజేయాలి. ఇదీ ఒప్పం దం. మీకు సమ్మతమేనా?" అని అడిగాడు.

కంకణుడు నిర్లక్ష్యంగా తలవూపి, అడగమ న్నట్టు చూశాడు.

"అయితే వినండి, చెబుతాను! తెలిస్తేగానీ చెప్పలేనిది. చెబితేగానీ తెలియనిది. ఆలోచిం చిన మీదట తెలిసేది ఏమిటి?" అని అడి గాడు సుప్రతీకుడు.

కంకణుడు పెద్దగా నవ్వి, "ఒక మనిషి పేరు," అన్నాడు.

"కాదు, పొడుపుకథ. ఒక మనిషి పేరు ఏమిటన్నది, ఆ మనిషి చెబితేనే తెలుస్తుంది తప్ప, ఆలోచిస్తే తెలియదు. అదే పొడుపు కథ అయితే, తార్కికంగా కాసేపు ఆలోచిస్తే సమాధానంతెలియవచ్చు," అన్నాడు సుప్రతీకుడు.

కంకణుడు వెలవెలపోయాడు. ఒప్పందం ప్రకారం సుప్రతీకుడు, అతడి వద్దనుంచి గంటను లాగేసుకున్నాడు.

"నా రెండో ప్రశ్న: ఒక చెట్టు. చెట్టుకు రెండు కొమ్మలు. ఒక్కొక్క కొమ్మమీద ఐదు గురు కూర్చున్నారు. ఐదుమంది కుత్తుకలు కత్తిరించినా, ఒక్క చుక్క రక్తం కారలేదు. ఒక్కరి ప్రాణం కూడా పోలేదు. ఏమిటది?"



అని ప్రశ్నించాడు సుప్రతీకుడు. కంకణుడు బాగా ఆలోచించి, వేదాంతపరమైన సమాధానాలు కొన్ని చెప్పాడు. కానీ, సుప్రతీకుడు అవేవీ కాదన్నాడు. చివరకు కంకణుడు మౌనాన్ని ఓటమిగా గ్రహించి, వాడే సమాధానం చెప్పాడు:

"చెట్టంటే మనిషి. రెండు కొమ్మలంటే చేతులు. ఐదుమంది వేళ్ళు. కుత్తుకలు గోళ్లు. గోళ్లు కత్తిరించినప్పుడు రక్తం కారడంగానీ, కనీసం నొప్పి కలగడం గానీ జరగదుకదా!"

మూడో ప్రశ్న ఏమిటన్నట్టు చూశాడుకంకణుడు.

"సువిశాలమైన సౌశీల్య దేశాన్ని, సౌశీలుడు మొదలు నిన్నమొన్నటి రత్నభూపాలుడి వరకు ఎందరో రాజులు పాలించారు. ఆ వరసలో, సకలకళాసమాహార భూషణ బిరుదాంకితుడైన సర్వోత్తముడు మరణించక ముందు సౌశీల్య దేశ రాజు ఎవరు?" అని ప్రశ్నించాడు సుప్రతీకుడు.

"ఇంత చిన్న విషయమా ప్రశ్నించేది? సర్వోత్త ముడి కన్నా ముందు సౌశీల్యదేశరాజు రాజ్యవర్ధనుడు," అన్నాడు కంకణుడు. ఇందుకు సుప్రతీకుడు పెద్దగా నవ్వి, "దీన్ని చిన్న విషయంగా భావించడం వల్లనే తప్పు చెప్పావు. సర్వోత్తముడు మరణించక ముందు, సర్వోత్తముడే రాజుగా వుంటాడు కానీ, రాజ్యవర్ధనుడు ఎలా వుంటాడు?" అన్నాడు.

కంకణుడు మారు మాట్లాడకుండా, తన ఓటమిని అంగీకరించి, సుప్రతీకుడు చెప్పిన ఒప్పందం ప్రకారం గంటను పల్లకీలో వుంచి, స్వయంగా తీసుకువెళ్ళి, రాజు సత్యాకరుడికి అందజేశాడు. సత్యాకరుడు జరిగింది విని సంతోషించి, సుప్రతీకుణ్ణి వాడి వివరాలు అడిగాడు.

దానికి సుప్రతీకుడు, "ప్రభూ! మాది విద్వాంసుల కుటుంబమే కానీ, నా చిన్నతనంలోనే తల్లీ, తండ్రీ మరణించడంతో, కాలం కలిసి రాక ఇలా పసులకాపరినైనాను," అని వినయంగా చెప్పాడు.

తమ ఆస్థానం ప్రతిష్ఠను కాపాడినందుకుగాను సత్యాకరుడు, సుప్రతీకుణ్ణి ఘనంగా సత్కరించి, ఆస్థానంలోనే పని కల్పించాడు.






ఒక గ్రామంలో భద్రయ్య అనే మోతుబరి రైతు వుండేవాడు. అతని పెద్దఇంటిపక్కనే మంగమ్మ అనే పేదరాలు గుడిసె వేసుకుని, అందులో ఉంటూ, గుడిసె చుట్టూ పూల మొక్కలు పెంచి, పూలు అమ్ముకుని తల్లీ తండ్రీలేని తన అయిదేళ్ల మనవడితో సంతోషంగా జీవిస్తూ ఉండేది.

మంగమ్మ గుడిసె ఉన్న ఆవరణను తన ఆవరణలో కలుపుకోవాలని భద్రయ్యకు దుర్బుద్ధి పుట్టింది. అతను ఒకనాడు మంగమ్మను పిలిచి, "చూడు, మంగమ్మా, నేను మా ఇంటిని పెంచాలనుకున్నాను. నీస్థలం నాకు ఇచ్చెయ్యి. నీకు నష్టం లేకుండా అంతో ఇంతో ముట్టజెప్పుతాలే," అన్నాడు.

అందుకు మంగమ్మ ఏమాత్రం ఒప్పుకోలేదు.

"నాకూ, నా మనవడికీ ఉన్నదే ఆ గుడిసె. అది తప్ప మాకు వేరే చోటులేదు. దాన్ని వదిలేసి ఎక్కడికి పోను? అదే మా పంచ ప్రాణాలు. నా భర్తా, కోడలూ, కొడుకూ ఆ గుడిసెలోనే చనిపోయారు. నా ప్రాణాలు కూడా ఆ గుడిసెలోనే పోతే నాకు తృప్తి," అన్నదామె భద్రయ్యతో.

నయాన మంగమ్మను ఒప్పించలేక భద్రయ్య ఆమెను బెదిరించాడు : "నువ్వా గుడిసెను రేపటిలోగా ఖాళీచేసి తీరాలి," అన్నాడు కోపంగా.

"నేను నా గుడిసెను ఎందుకు ఖాళీ చెయ్యాలి? అది ఏ లెక్క ప్రకారం?" అని మంగమ్మ అడిగింది.

భయాన కూడా మంగమ్మ లొంగకపోయేసరికి భద్రయ్య తన ధనబలంతో దౌర్జన్యానికి దిగాడు.

అతను పాలేర్లను పిలిచి గుడిసెలోని సామాన్లు బయట పారేయించి, గుడిసెను పీకించేశాడు.

25—ఏళ్ళనాటి చందమామ కథ

మంగమ్మ గోడుగోడున ఏడుస్తూ వెళ్ళి తనకు జరిగిన అన్యాయాన్ని గ్రామపెద్దలకు చెప్పుకున్నది.

గ్రామపెద్దలు పంచాయతీ జరిపి, భద్రయ్యను కూడా పిలిపించి సంజాయిషీ అడిగారు.

"ఈ ముసలిదాని కొడుకు బతికి ఉండగా నాదగ్గిర వంద రూపాయలు అప్పుగా తీసుకుని, పత్రం రాసి ఇచ్చాడు. ఆ పత్రం నా దగ్గర ఇంకా భద్రంగా ఉన్నది. దీని భర్తగాని, ఈ ముసలిదిగాని ఇంతవరకు వడ్డీ అయినా చెల్లు వెయ్యలేదు. ఎన్నాళ్ళు ఊరుకుంటాను... అసలు, వడ్డీల కింద నేను వాళ్ళ గుడిసెను స్వాధీనం చేసుకున్న మాట నిజమే," అంటూ భద్రయ్య ఏమాత్రం తొణక్కుండా ఎవరిదో వేలిముద్ర వున్న దొంగపత్రాన్ని గ్రామపెద్దలకు చూపాడు.

గ్రామపెద్దలు ఆ పత్రాన్ని నమ్మి భద్రయ్యకు అనుకూలంగా తీర్పు చెప్పారు. ముసలిదానికి న్యాయం జరగకుండా పోయింది. భద్రయ్య దుర్మార్గాన్ని ఎదుర్కోలేక మౌనంగా ఊరుకున్నది.

తరవాత ముసలి మంగమ్మ మరొకచోట చిన్న గుడిసె వేసుకుని, పూర్వంలాగే పూలు అమ్ముకుంటూ కాలక్షేపం చెయ్యసాగింది.

కొద్ది రోజులు గడిచాయి. భద్రయ్య మంగమ్మగుడిసె ఉండిన చోట భవనం నిర్మించడానికి పునాదులు తవ్వించసాగాడు. ఒకనాడు మంగమ్మ తన మనవణ్ణి వెంటబెట్టుకుని తవ్వకాలు జరిగే చోటికి వచ్చింది.



అక్కడ పనిచేస్తున్న వాళ్ళతో పాటు భద్రయ్య కూడా ఉన్నాడు.

భద్రయ్య ఆమెను చూసి, "ఏం ఇట్లా వచ్చావు?" అని అడిగాడు హేళనగా తల ఎగరవేస్తూ.

"తమరు గొప్పవారు, నేను పేద ముండను. పూలమ్ముకుంటూ ఎప్పటిలా పొట్ట పోసుకుంటున్నాను. నువ్వు నన్ను కనికరించదగిన వాడివి. బాగా ఆలోచించి నీ నుంచి ఒక చిన్న సహాయం కోసం వచ్చాను," అన్నది మంగమ్మ.

"ఏమిటా సహాయం?" అని భద్రయ్య అడిగాడు.

"నా మనవడు పాతచోటు చూపించమని రోజూ ఒకటే పోరు," అన్నది మంగమ్మ.

"చూపించావుగా? ఇక వెళ్ళు," అన్నాడు భద్రయ్య.

"అలాగే పోతాను. నాకు ఒక గంపెడు నా గుడిసె మన్ను ఇప్పించు, బాబూ. దానితో పొయ్యి వేసుకుని, వండుకు తింటూ తృప్తి పడతాం," అన్నది మంగమ్మ.

ఆ పిచ్చి కోరిక విని భద్రయ్య పకపకా నవ్వి, "సరే, తీసుకుపో," అన్నాడు.

మంగమ్మ ఒక గంప నిండా పాత గుడిసె మన్ను నింపుకుని, "బాబూ, నీకు పుణ్యం ఉంటుంది, కాస్త ఆ గంప నీ చేతి మీదిగా నా నెత్తికెత్తు," అన్నది.

భద్రయ్య గంప ఎత్తబోయాడు.

కాని అంత బరువు ఎత్తటం అతని వల్ల కాలేదు. మళ్ళీమళ్ళీ ప్రయత్నించాడు. ముచ్చెమటలు పోశాయేగాని, ప్రయోజనం లేక పోయింది.

మంగమ్మ గట్టిగా నవ్వి, "ఈ గంపెడు మన్ను మోయలేని వాడివి ఇంత మన్నూ ఎలా మోద్దామనుకున్నావు, నాయనా?" అని ప్రశ్నించింది.

భద్రయ్యకు చెప్పరాని అవమానమయింది. అవమానంతో బాటు ఆ క్షణమే జ్ఞానోదయం కూడా అయింది. తాను చేసిన నీతిమాలిన పనికి సిగ్గుపడి, అతను ఆ తవ్విన పునాదులతోనే మంచి ఇల్లు కట్టించి, దాన్ని మంగమ్మకు ఇచ్చేశాడు.



**PolioPlus**



# IMMUNIZATION AN ASSURANCE OF GOOD HEALTH TO CHILDREN

## VACCINATIONS When and How Many

| Age to Start Vaccination | Name of Vaccine | Name of Disease | How Many Times |
|---|---|---|---|
| Birth | BCG | Tuberculosis | Once |
| 6 weeks | Polio | Polio | Three times with intervals of at least one month |
| 6 weeks | DPT | Diphtheria Pertussis (Whooping Cough) Tetanus | Three times with intervals of at least one month |
| 9 months | Measles | Measles | Once |

**Babies should receive all vaccinations by the time they are twelve months old.**



Pregnant women should get themselves vaccinated against Tetanus (TT) twice—in an interval of at least one month—during the later stages of pregnancy.

**HEALTHY CHILD—NATION'S HOPE & PRIDE**

Design courtesy : World Health Organisation

# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1995 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



Shanbagavalli



Sundaramurthy

✷పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ✷ ఏప్రిల్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ✷మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ✷వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

---

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చూసేరా నా విద్య మక్కువగా? రెండవ ఫోటో : శివపార్వతులిద్దరు ఒక్కటిగా!

పంపినవారు : శ్రీవరప్రసాద్, F/o, ఎస్.పి.వి. మహాలక్ష్మి. 42/1, రాజ్ ఫ్లాట్స్,
హారింగ్టన్ రోడ్, మద్రాసు - 600 030.

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 60.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ




వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి:

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి!

<u>సంవత్సర చందా:</u>

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా: రూ. 117.00 ఎయిర్ మెయిల్ ద్వారా: రూ. 264.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా: రూ. 123.00 ఎయిర్ మెయిల్ ద్వారా: 264.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి:
సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026

# ఏమి విచిత్రం!

అది ఒక ఆహ్లాదకరమైన సాయంత్రం. సోనూ బడినుండి ఇంటికివస్తున్నాడు హఠాత్తుగా అక్కడ ఒక గాలిదుమారం లేచింది. ఎగిరే ప్లేటులాంటి విచిత్రమైన వస్తువు క్రిందికి దిగుతూ తిన్నగా సోనూ ముందుకు వచ్చి ఆగింది



















